# బడదీదీ






**12**

*annas*

కాగితము కరువువల్ల యీ ప్రచురణలు కొద్ది కాపీలే ముద్రిస్తున్నాము. కాన ప్రతి ఏజంటుకు మేము కావలసినన్ని కాపీలు సప్లయి చేయలేక పోవచ్చును. అట్టి పరిస్థితులలో పాఠకులు తమ కాపీని మిత్రులకు కూడా ఇచ్చి మా కృషిని సార్థకము చేసెదరని భావించుచున్నాము.

# బడదీదీ

శరత్‌చంద్రచటర్జీ
రచితం

"చక్రపాణి"
అనువాదం

యువ బుక్ డిపో
43 ఆచారప్పన్ వీధి
మద్రాసు :: తెనాలి

# బడదీదీ

ఈ ప్రపంచంలో ఒకరకం మనుష్యులున్నారు—వారు గప్పున మండనూ వచ్చును, చప్పున చల్లారనూ వచ్చును. వారి వెనక సర్వకాలసర్వావస్థలయందూ ఒక మనిషి ఉండాలి—అవసరాన్నిబట్టి గడ్డి వేస్తూ ఉండటానికి.

స్త్రీలు ప్రమిప వెలిగించబోయే ముందు, తైలమూ వత్తీతోపాటు దాంట్లో ఇంకో పూచికపుల్లకూడా వేస్తారు. దీపశిఖతగ్గిపోయేటప్పుడు ఈచిన్ని పుడక చాలా అవసరం, ఎగ ద్రోయటానికి; అది లేకపోతే తైలమూ వత్తీ ఉన్నప్పటికీ దీపం వెలగదు.

సురేంద్రుని ప్రకృతికూడా కొంతవరకు ఇలాంటిదే. అతనికి బలమూ, బుద్ధీ, సాహసమూ—అన్నీ ఉన్నాయి. కాని ఏపనీ అతను ఒంటరిగా నెరవేర్చ లేడు. కొంతపని అతను ఎంత ఉత్సాహంగాచేస్తాడో మిగతాది అంత పాలుమాలికగా వదలివేసి మెదలకుండా కూర్చుంటాడు. అప్పుడే ఒక మనిషి అవసరం—అతన్ని పురికొల్పటానికి.

సురేంద్రుని తండ్రి యు. పి. లో వకీలు. వంగదేశంతో అతనికి అంతగా సంబంధంలేదు. సురేంద్రుడు ఇక్కడనే ఇరవయ్యోయేట ఎం. ఏ. ప్యాసయ్యాడు—కొంత స్వశక్తితోటీ, కొంత మారుతల్లి ప్రోద్బలంవల్లా! ఆ మారుతల్లికూడా ఇతని వెంట ఎంతగా. పడుతూ ఉండేదంటే— అనేక సమయాల్లో సురేంద్రుడు తనకేమైనా స్వాధీనసత్తా

లున్నాయా అని సందేహిస్తూ ఉండేవాడు! సురేంద్రుడనే పేరుగల స్వతంత్రజీవి ఏదీ ఈజగత్తులో నివసించటం లేదు; విమాత ఇచ్ఛయే ఒకమనిషి రూపం ధరించి పనిపాటలూ, తిండితిప్పలూ, చదువుసంధ్యలూ, ప్యాసుకావటమూ మొదలగు పనులు నిర్వర్తిస్తూఉంటుంది! ఈ మారుతల్లి—తన సంతానంమీద కొంత ఉదాసీనత చూపించినా—సురేంద్రుని సంరక్షణలో మాత్రం లోటు ఉంచేదికాదు. ఇలాంటి కర్తవ్యపరాయణురాలైన స్త్రీఅనుపులోఉండి సురేంద్రుడు చదువయితే నేర్చుకున్నాడు; కాని స్వావలంబనం మాత్రం నేర్చుకోలేదు. తనమీద అతనికి విశ్వాసంలేదు. ఏపని కూడా తనవల్ల చక్కగా నెరవేరుతుందనే నమ్మకం అతనికి లేదు. ఎప్పుడేది అవసరమో, ఎప్పుడేది చేయాలో కూడా అతనికి తెలియదు—ఇతరుల మీద పూర్తిగా ఆధారపడి ఉండేవాడు. జ్ఞానం వచ్చినప్పటినుంచీ ఈపది హేనేళ్లూ విమాత మీదనే భారంవేసి గడిపాడు.

మారుతల్లి యితనికి బోలెడు చాకిరి చేస్తూ ఉండేది. ఇరవైనాలుగు గంటల్లో ఇరవైరెండు గంటలు తిరస్కారమూ, తిట్లూ, ప్రశ్నలూ, దెబ్బలూ, మాటివిరుపులూ సహించడమేకాకుండా పరీక్ష ఇంకా సంవత్సరమున్న దనగానే, సురేంద్రుని రాత్రంతా చదివించటంకోసం ఆమె తన నిద్రసుఖాన్నికూడా విసర్జించేది. సవతికొడుకు కోసం ఎవరింత ప్రయాసపడతారు? ఇరుగు పొరుగు అమ్మలక్కలు, ఈవిషయంలో మాత్రం, ఆమెను ఏకగ్రీవంగా మెచ్చుకోనేవారు కారు.

ఆమెకు సురేంద్రునిపై అంతరంగిక ప్రేమ ఉండేది. తిట్లూ, తిరస్కారాలు అయిపోయినాక సురేంద్రుని కళ్ళ వెంట నీళ్ళు కారేవి. మారుతల్లి అది జ్వరానికి పూర్వ లక్షణమని గ్రహించి, మూడురోజులవరకూ సగ్గుబియ్యపు జావ ఇచ్చేది. మానసిక ఉన్నతిని గురించీ, విద్యావిషయం లోనూ ఆమెదృష్టి మహాతీక్షణంగా ఉండేది. సురేంద్రుని ఒంటిమీద శుభ్రమైనవికానీ, లేక ఆధునిక పద్ధతిలోఉన్నవి కానీ దుస్తులు కనపడగానే, అతనికి షోకూ దర్జా బలిసి పోతున్నదని వెంటనేగ్రహించి, అతనిదుస్తులు రెండుమూడు వారాలవరకూ చాకలింటికి పోనివ్వకుండా నిషేధించేది.

ఈవిధంగా సురేంద్రుడు కాలయాపన చేస్తున్నాడు. ఇలాంటి ప్రేమపూరితమైన కావుదలలో పెరుగుతూ ఉండ టంచేత, అప్పుడప్పుడు అతనికి జీవితంమీద నిరాశ కలు గుతూ ఉండేది. అందరూకూడా తమజీవితం ఇలాగే గడు పుతూ ఉంటారు కాబోలని ఒక్కొక్కప్పుడు తృప్తి పడు తూండేవాడు. కాని అతని మిత్రులు వూరుకొనేవారు కారు. ఏదో ఒకటి అతని బుర్రకు ఎక్కించి పోతూ ఉండేవారు.

ఒకరోజున ఇలాంటిదే జరిగింది. అతని మిత్రుడు ఒకడు—'నీవంటి బుద్ధిమంతుడు విదేశాలకువెళ్ళితే ఉన్నతి పొందటానికి ముందు చాలా అవకాశమున్నది. స్వదేశం తిరిగివచ్చినాక అనేకమందికి ఉపకారాలు చేయవచ్చు'నని సలహా యిచ్చాడు. సురేంద్రునికి ఈసలహా నచ్చింది. వన్యపక్షికంటే పంజరంలోనిపక్షే ఎక్కువ కొట్టుకు లాడుతూ ఉంటుంది. సురేంద్రుడు కల్పనా నేత్రంతో కొద్ది

ముక్తవాయువునూ, స్వాధీనతా ప్రకాశాన్నీ చూడగలిగాడు. దానికే అతని పరాధీనప్రాణం ఉన్మత్తునివలె రెపరెప కొట్టుకుంటూ పంజరంలో తిరగనారంభించింది.

సురేంద్రుడు తండ్రి దగ్గరకు వచ్చి తన్ను విదేశాలకు పంపించమని అడిగాడు. అక్కడికి వెళ్ళితే తానింకా ఉచ్ఛస్థితిలోకి వస్తాననికూడా చెప్పాడు. తండ్రి "ఆలోచించి చూస్తా" నన్నాడు. కాని మారుతల్లికి ఏమాత్రమూ యిష్టం లేదు. ఆమె తండ్రి కొడుకుల మధ్యకు తుపాను వలె వచ్చి అట్టహాసం చేస్తూ అన్నది:

"అయితే నన్నుకూడా విదేశాలకు పంపండి! లేకపోతే సురోను ఎవరు చూస్తారు? అన్నం తినటం, బట్ట కట్టుకోటం కూడా చాతకానివాణ్ణి కానిచోటికి ఎలా పంపుతారు? బగ్గీ గుర్రాన్ని పంపినా ఒకటే వాణ్ణి పంపినా ఒకటే! గుర్రం కనీసం ఆకలి అవుతున్నదో నిద్రవస్తున్నదో నన్నా తెలుసు కుంటుంది. మీ సురోకి అదికూడా తెలియదు!"— తర్వాత మళ్ళీ నవ్వు.

అతిగా నవ్వటం చూచి సురేంద్రుని తండ్రి చాలా సిగ్గు పడ్డాడు. సురేంద్రుడుకూడా ఈతథ్యాన్ని ఖండించలేమని తెలుసుకొని విదేశాలకు పోవాలనే ఆశ వదలిపెట్టాడు. అతని మిత్రుడు ఇది విని చాలా చింతించాడు. కాని విదే శాలకు పోయే సదుపాయమేదీ చేయలేకపోయాడు. ఆఖరికి అతను తేల్చిందేమంటే: "ఇలా పరాధీనంగా ఉండటంకంటే బిచ్చమెత్తుకుతినటం మంచిది. అయినా నీలాగా 'మెమ్మో' ఫస్టున ప్యాసయిన కుర్రవాడు బిచ్చమెత్తాల్సిన అవసరం

ఉండదని నా నమ్మకం.'' అని..

సురేంద్రుడు ఇంటికివచ్చి ఈ సంగతే ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆలోచించినకొద్దీ అతనికి మిత్రుడు చెప్పినమాటలే సరిగా కనిపించినవి. బిచ్చమెత్తుకు తినటమే మంచిది! అందరూ విదేశాలకు పోలేనిమాట నిజమే; కాని ఈ విధంగా జీవన్మృతునివలె దినాలు ఎవ్వరూ గడుపుతూ ఉండరు.

ఒకనాటి అర్ధరాత్రి స్టేషనుకువచ్చి కలకత్తాకు టిక్కెట్టు తీసుకొని బండిలో కూర్చున్నాడు. అప్పుడే తండ్రికి ఒక ఉత్తరంకూడా వ్రాశాడు:—తను కొన్నాళ్ళపాటు ఇల్లు వదలి పెట్టుతున్నాడు. వెదకటం అనవసరం. ఒకవేళ జాడ తెలిసినాగానీ తను యింటికి వస్తాడన్న నమ్మకం ఉంచనక్కరలేదు!

సురేంద్రుని తండ్రి ఉత్తరం భార్యకు చూపించాడు.

''సురో యిప్పుడు మనిషి అయ్యాడు. విద్యనేర్చుకున్నాడు; రెక్కలు వచ్చినవి—ఇప్పుడు ఎగిరి పోకపోతే యింకెప్పుడు ఎగిరిపోతాడు?'' అన్నది మారుతల్లి.

అయినా తండ్రి చాలా వెదకించాడు. కలకత్తాలో ఉన్న మిత్రులందరికీ జాబులు వ్రాశాడు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది.

సురేంద్రుని జాడ చిక్కనేలేదు.

## ౨

జనసంకులమైన కలకత్తా రాజవీధిలో ప్రవేశించి సురేంద్రుడు తన పొరపాటును గుర్తించాడు. ఇక్కడ తాను తిరస్కరించాలన్నా ఎవ్వరూ లేరు. రాత్రింబగళ్ళు తన్ను శాసించే వారూ యెవ్వరూ లేరు. ముఖంవాడిపోయినా చూసే వాళ్ళు లేరు; ముఖంమాడ్చుకున్నా లక్ష్యపెట్టేవాళ్ళు లేరు. ఇక్కడ ఎవర్ని వారు చూసుకోవలసిందే. ఇక్కడ బిచ్చం దొరుకుతుంది, కరుణకు స్థానమున్నది; ఆశ్రయం కూడా చిక్కుతుంది. కాని తనకై తాను ప్రయత్నించాలి. తమకుతామై వచ్చి ఎవ్వరూ జోక్యం కలిగించుకోరు.

తనకుతానుపోవటం, ఆశ్రయం వెతుక్కోవటం, సురేంద్రుడు ఇక్కడకు వచ్చిన తర్వాతనే నేర్చుకున్నాడు. ఆకలికీ నిద్రకూ మధ్యఉన్న కొద్ది తేడా కూడా అతను ఇక్కడకు వచ్చిన తర్వాతనే తెలుసుకున్నాడు.

ఇల్లువదిలి చాలకాలమైంది. ఎప్పుడూ తిరుగుతూ ఉండటంచేత శరీరము అలిసిపోయింది, తెచ్చిన డబ్బుకూడా నిండుకోవటానికి సిద్ధంగాఉన్నది; దుస్తులు మురికి అయి చిరిగిపోవటానికి సిద్ధంగా ఉన్నవి; రాత్రిళ్ళు తలదాచుకోవటానికి ఠికానా లేదు. ఇంటికి ఉత్తరం వ్రాయాలంటే ఎంతో సిగ్గుగా ఉండేది. సురేంద్రుని కళ్ళలో నీరు తిరిగింది. మాని తల్లి స్నేహకఠిన వదనం తలపుకు వచ్చినపుడు అతడ ఇంటికి వెళ్ళాలనే కోరిక అడుగంటేది. ఒకప్పుడు అక్కడికి ఉన్నట్టు అనుకోవటానికే భయపడేవాడు.

ఒకరోజున తనవంటి దరిద్రుని ఇంకొకడిని చూచి—

"ఏం, బాబూ! నీకిక్కడ తిండి ఎలా దొరుకుతున్నది?" అని అడిగాడు. ఆవ్యక్తికొస్త మందమతి. లేకపోతే ఎగతాళి చేసేవాడే! "చాకిరి చేసుకు తింటాను! కలకత్తాలో పనులకేమి తరుగు!" అని జవాబిచ్చాడు.

"నాకూ్కడా ఏదన్నాపని చూపిస్తావా?"

"నీకేంపని చేతనవు?"

సురేంద్రునికి ఏపనీ చాతకాదు. అందుకని ఏమి చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు. "నువ్వు కులీనుడవా?"

సురేంద్రుడు అవునన్నట్లు తల ఊపాడు.

"అయితే చదువెందుకు నేర్చుకోలేదు?"

"నేర్చుకున్నాను."

ఆవ్యక్తి కొంచెం ఆలోచించి "అయితే ఆ ఇంటికిపో, అక్కడ పెద్దజమీందారున్నాడు. ఏదో ఒకపని చూపిస్తాడు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

సురేంద్రుడు సింహద్వారందాకా వచ్చి ఆగిపోయాడు. మళ్ళీ వెనక్కు వచ్చాడు. ఇలా ఒకటి రెండుసార్లు చేశాడు. ఆరోజున అతనివల్ల ఏమీ కాలేదు. మర్నాడు కూడా ఈవిధంగానే గడిచింది. ఈరెండు రోజులూ కొంత సాహసం సమకూర్చుకొని మూడోనాడు లోపల ప్రవేశించాడు. లోపలవున్న సేవకుడు "ఏం కావాలి?" అని ప్రశ్నించాడు. "బాబు—" అన్నాడు.

"బాబుగారు ఇంట్లో లేరు."

సురేంద్రుని ముఖం ఆనందంతో వికసించింది. ఒక మహాకఠిన కార్యంనుంచి అతడు విముక్తిపొందాడు. బాబు

గారు ఇంట్లో లేరట! తన చాకిరిసంగతీ, తన దుఃఖగాథా వినిపించవలసి రాలేదు. ఇదే అతని సంతోషానికి కారణం.

సురేంద్రుడు ద్విగుణితోత్సాహంతో దుకాణానికి తిరిగి వచ్చి కడుపునిండా మిఠాయి తిన్నాడు. ఇక ఆవాళంతా మహా ఆనందంతో తిరుగుతూ— రేపు ఏవిధంగా సంభాషణ మొదలుపెట్టితే తనపని సానుకూల మవుతుందా అని ఆలోచించ నారంభించాడు.

మరునాడు అతనికి ఉత్సాహమంతగా లేదు. ఇల్లు దగ్గరకు వచ్చినకొద్దీ, తిరిగిపోవాలనే కోరిక అతనిలో ప్రబలం కాసాగింది. మెల్లగా సింహద్వారం దగ్గరికి వచ్చి ఆగి పోయాడు. లోపలకు పోవటానికి కాళ్ళు మొండికివేసినవి. తనకోసం తాను వచ్చినట్టుగా అతనికేమాత్రం తోచటం లేదు. ఎవరో అతన్ని బలవంతాన పంపినట్టుగా ఉంది. ఎక్కువసేపు ద్వారంవద్ద వేచిఉండలేక ఇంట్లోప్రవేశించాడు. మరల ఆభృత్యుడే తారసిల్లాడు.

"బాబుగారు ఇంట్లోనే ఉన్నారు. చూస్తారా?"

"ఆఁ," అన్నాడు సురేంద్రుడు.

"అయితే రండి."

పోవటం ఇంకా కష్టం. జమీందారుగారి ఇల్లు చాలా పెద్దది. పాశ్చాత్యపద్ధతిని అలంకృతమైఉన్నది. చాలా గదులు—అంతటా పాలరాళ్ళుపరచి ఉన్నాయి. విద్యుద్దీపాలతో ప్రతిగదీ శోభిల్లుతూ ఉన్నది. గోడలకు పెద్దఅద్దాలు, ఎన్నో తైలచిత్రాలు, ఎన్నో ఫొటోలు. ఇవి ఇతరులకు ఎలా ఉన్నా సురేంద్రునికి మాత్రం క్రొత్తకాదు. కారణం

అతని తండ్రి ఇల్లుకూడా దరిద్రుని కుటీరంకాదు; కనీసం, అతను దరిద్రుని ఆశ్రయంలో పెరగలేదు. సురేంద్రుడు తాను చూడబోయే, వినయవిన్నపాలు చేయబోయే వ్యక్తినిగురించే ఆలోచిస్తున్నాడు. అతను ప్రశ్నిస్తే తాను ఏమి జవాబివ్వాలి?

ఇంక ఆలోచించటానికికూడా వ్యవధిలేదు. యజమాని ఎదురుగా కూర్చుని ఉన్నాడు—"ఏంకావాలి?" అని సురేంద్రుని ప్రశ్నించాడు. మూడురోజులనుంచీ శ్రమపడి ఆలోచించుకొన్న సంగతులన్నీ మరచిపోయి సురేంద్రుడు "నేను—నేను—" అని తడబడ్డాడు.

జమీందారుగారిపేరు వ్రజరాజ లాహిడీ. తల నెరసింది. అకాలపక్వంకాదు, వయసువచ్చే పండింది. ధనవంతుడు. బోలెడు ప్రపంచం చూశాడు. అందుకనే, చప్పున, సురేంద్రుని చాలాభాగం అర్థంచేసుకొని—"సరే, బాబు! ఏం కావాలి నీకు?" అని అడిగాడు.

"ఏదన్నా ఒక—"

"ఒక?"

"పని—"

వ్రజరాజబాబు మందహాసంచేసి "నేను పని చూపిస్తానని నీకెవరు చెప్పారు?" అని అడిగాడు.

"దోవలో ఒక మనిషి కనబడితే అడిగాను. అతనే మీ దగ్గరికి పొమ్మన్నాడు."

"అలాగా! మీ ఇల్లెక్కడ?"

"పడమట."

"అక్కడ ఎవరున్నారు?"

సురేంద్రుడు చెప్పాడు.

"నీతండ్రి ఏమి చేస్తూ ఉంటాడు?"

సురేంద్రుడు కాలానుగుణ్యంగా నడవటం ఇప్పుడే కొస్త నేర్చుకున్నాడు—"మామూలు చాకిరి," అన్నాడు నచ్చు కొట్టుతూ.

"దానితో గడవటం లేదని నువ్వుకూడా సంపాదించ టానికి వచ్చావా?"

"ఆఁ."

"ఇక్కడ ఎక్కడ ఉంటున్నావు?"

"ఫలానిచోటని లేదు. ఇక్కడా, అక్కడా—"

వ్రజబాబుకు కనికరం కలిగింది. సురేంద్రుని దగ్గర కూర్చొబెట్టుకొని, "నీవింకా కుర్రవాడివి. ఈవయస్సులోనే ఇల్లు వదలవలసివచ్చినందుకు నాకు చాలా చింతగా ఉంది. నీకేమీ పని చూపించలేను కాని, దొరికే సదుపాయం మాత్రం చేయగలను," అన్నాడు.

సురేంద్రుడు—"చిత్తం," అని వెళ్లుతూ ఉండటం చూచి వ్రజబాబు అతన్ని పిలిచి—"ఇక అడగవలసిం దేమీ లేదా?" అని అడిగాడు.

సురేంద్రుడు విస్తుపోయి అలాగే నిలబడిపోయాడు. వ్రజ బాబు "ఇప్పుడు ఎక్కడకు వెళ్తావు?" అన్నాడు.

"ఏదన్నా ఒక దుకాణానికి."

"అక్కడే భోంచేస్తావా?"

"రోజూ అలానే చేస్తున్నాను."

"నువ్వు ఎందాకా చదివావు?"

"ఏదో కొద్దిగా—"

"మా అబ్బాయికి చదువు చెప్పగలవా?"

సురేంద్రుడు మహాసంతోషంతో—"ఆ," అన్నాడు.

వ్రజబాబు మళ్ళీ నవ్వాడు; దుఃఖంచేతా, దారిద్ర్యం మూలానా అతని బుర్ర చెడిపోయి ఉంటుందని మనస్సులో అనుకున్నాడు. ఎవరికి చదువు చెప్పాలో, ఏమి చదువు చెప్పాలో తెలుసుకోకుండానే అంతగా సంతోషించటం వెర్రివాని లక్షణం అనుకొన్నాడు—"వాడు బి. ఏ. చదువుతున్నానంటే నువ్వు వాడికి ఎలా చెప్పగలవు?" అని అడిగాడు.

"ఏదో విధంగా—" అన్నాడు సురేంద్రుడు గంభీరంగా.

వ్రజబాబు ఇంకేమీ అడగలేదు. నౌకర్ని పిలిచి—"బంకూ, ఈ బాబుకు, ఉండేటందుకు ఒక గది చూపించి, స్నానం, భోజనాలసంగతి చూడు!" అని చెప్పి సురేంద్రుని వంక చూచి, "నువ్వు మా ఇంట్లోనే ఉండు. పనిదొరికేటంతవరకూ నువ్విక్కడ స్వేచ్ఛగా ఉండవచ్చు" అన్నాడు.

వ్రజబాబు భోజనం చేయబోయినప్పుడు పెద్దకుమార్తె మాధవిని పిలిచి—"అమ్మా, ఇవ్వాళ మనఇంట్లో ఒక దీనుడికి చోటిచ్చాను," అన్నాడు.

"ఎవరు, నాన్నా?"

"పాపం, ఎవరో దీనుడు. అతన్ని గురించి అంతకంటే ఎక్కువ నాకేమీ తెలియదు. కొద్దిగా చదివిన వాడిలాగానే కనపడుతున్నాడు. ఎలాగనుకున్నానంటే, మీ

అన్నయ్యకు చదువుచెప్పాలన్నాకూడా ఒప్పుకున్నాడు. బి. ఏ. కుర్రవాడికి చదువుచెప్ప సాహసించినవాడు కనీసం, మీచెల్లికి చదువు చెప్పలేకపోతాడా? ప్రమీలకు ఇతన్నే పంతులుగా నియమించాలని ఉన్నది.''

మాధవి అడ్డుచెప్పలేదు.

సాయంకాలం వ్రజబాబు సురేంద్రుని పిలిపించి ఈ సంగతి చెప్పాడు. మర్నాటినుంచీ ప్రమీల సురేంద్రుని వద్ద చదవ నారంభించింది.

ప్రమీలకు ఏడో ఏడు. ఫస్టురీడరు చదువుతూ ఉన్నది. మాధవి అక్కయ్యవద్ద ''కప్ప'' పాఠంవరకు చదువుకున్నది. ఆ అమ్మాయి పుస్తకాలూ, పలకా, బలపమూ, బొమ్మలూ, పిప్పరమెంటుబిళ్ళలూ వగైరా పరికరాలతో చదవటానికివచ్చి కూర్చున్నది.

''Do not move—కదలవద్దు,'' అని సురేంద్రుడు చెప్పాడు. ప్రమీల—''Do not move—కదలవద్దు,'' అని చదవనారంభించింది.

తర్వాత సురేంద్రుడు పలకా బలపమూ తీసుకొని లెక్కలువేస్తూ కూర్చున్నాడు. 'ప్రాబ్లం' తర్వాత 'ప్రాబ్లం' 'నాల్గు' అవుతూఉన్నది. గడియారము ఏడు, ఎనిమిది, తొమ్మిది కొట్టింది. ప్రమీల కాసేపు అటూ ఇటూ జరుగుతూ, బొమ్మలపుస్తకం తిరగవేస్తూ, పండుకొంటూ, లేస్తూ, పిప్పరమెంటు బిళ్ళలు చప్పరిస్తూ, 'కప్ప' ఒంటిమీద సిరా పూస్తూ, అప్పుడప్పుడు—''Do not move—కదలవద్దు.'' అని వల్లిస్తూ ఉంది.

"మాస్టరుగారూ, వెళ్ళిపొమ్మంటారా?" అని చాలా సేపటికి ప్రమీల అడిగింది. "వెళ్ళు" అని జవాబు.

ఉదయం ఈవిధంగా గడుస్తుంది. కాని సాయంత్రం కార్యక్రమం వేరు. ఉద్యోగం కోసం వ్రజబాబు ఇద్దరు ముగ్గురు పెద్దమనుష్యుల పేర ఉత్తరాలు వ్రాసి ఇచ్చాడు; సురేంద్రుడు అవి జేబులో పెట్టుకొని బయలుదేరి వెళ్ళాడు. ఎంతో వెదకి వాళ్ళఇళ్ళ దగ్గరికి పోయి నిలబడి ఏమేడ ఎన్ని అంతస్తులదైనదీ, బయటవైపుకు ఎన్నివాకిళ్ళున్నదీ, ఎన్నికిటికీలున్నదీ, ఇంటిముందు లాంతరు స్తంభం ఉన్నదీ లేనిదీ—చూచి పొద్దుకుంకే వరకు ఇంటికి చేరుకుంటాడు.

కలకత్తా వచ్చినాక సురేంద్రుడు చాలా పుస్తకాలు కొన్నాడు. వచ్చేటప్పుడు ఇంటివద్దనుంచి కూడా కొన్ని తెచ్చుకున్నాడు. రాత్రిపూట విద్యుద్దీపపు కాంతిలో అవే చదువుకుంటాడు. వ్రజబాబు ఎప్పుడైనా ఉద్యోగం విషయమై ప్రస్తావించితే, మాట్లాడకుండానైనా ఊరుకునేవాడు, లేదా అవ్యక్తులు కనపడలేదనైనా చెప్పేవాడు.

## 3

వ్రజబాబు భార్యచనిపోయి ఇప్పటికి నాలుగు సంవత్సరాలైంది. వృద్ధాప్యంలో ఈదుఃఖాన్ని వృద్ధులు గ్రహించవలసిందే. ఈ దుఃఖ మిలా ఉండగా, గోరుచుట్టు మీాద రోకలిపోటువలె, వారి ప్రియ పుత్రిక మాధవి పదహారోయేట విధవ అయింది. ఈఘటన వ్రజబాబు శరీరంలోని సగం రక్తాన్ని పీల్చివేసింది. సాటివారిని లెక్కచేయకుండా

చాలాకోరికతో కుమార్తె వివాహంచేశాడు. వారికి బోలెడు డబ్బున్నది. అందుచేత, కుర్రవాని ఆస్తిపాస్తులు సంగతి విచారించలేదు. వారు చూచిందెల్లా, కుర్రవాని చదువూ, రూపమూ, ప్రవర్తనా!— ఇవిచూసే మాధవి నిచ్చి పెళ్లి చేశాడు.

పదకొండోయేట మాధవికి పెళ్లిఅయింది. మూడు సంవత్సరాలు కాపురంకూడా చేసింది. ఆదరమూ, స్నేహమూ, ప్రేమా—సర్వమూ పొందింది. కాని యోగీంద్రనాధుడే దక్కలేదు. మాధవిజీవితంలోని కోరికలన్నీ తుడిచివేసి, వ్రజబాహువక్షంలో శూలం గ్రుచ్చి, అతడు స్వర్గం వెళ్లిపోయాడు. చనిపోయేముందు మాధవి చాలా ఏడుస్తూ ఉంటే—‘‘మాధవీ, నిన్ను వదిలిపెట్టవలసి వచ్చిందనే నాకు చింత. నాకు చావంటే భయంలేదు. నువ్వు కష్టపడతావనే నాకు దుఃఖంగా వున్నది. నిన్ను నేను ఆదరించలేకపోయాను!’’ అని ఓదార్చాడు.

కట్టతెగిన ప్రవాహంలాగా అశ్రుధార యోగీంద్రుని శుష్కవక్షస్థలం మీదుగా ప్రవహింపనారంభించింది. మాధవి కన్నీటిధారను తుడుస్తూ—‘‘మళ్లీ నీపాదసేవ లభించినపుడు ఆదరింతురు గాని,’’ అని అన్నది.

‘‘మాధవీ, నా సుఖంకోసం అర్పిస్తూ వున్న నీ జీవితాన్ని ఇతరులకు సుఖం చేకూర్చటంలో సమర్పించు. ఎవరి ముఖం మలినంగా కనపడుతుందో, వారి ముఖాలు ప్రఫుల్లితం చేయటానికి ప్రయత్నించు. ఇంకా ఏమిచెప్పేది, మాధవీ!’’ మళ్లీ అశ్రువులు కార్చాడు. మాధవి చీరె

చెరగుతో ఒత్తింది.

"సన్మార్గంలో ఉండు. నీ పుణ్యంవల్లనే నిన్ను తిరిగి పొందుతాను."

మాధవి అప్పటినుంచీ పూర్తిగా మారిపోయింది. ఆమెలో కాస్తోకూస్తోవున్న క్రోధాన్నీ, హింసనూ, ద్వేషాన్నీ, భర్త చితాభస్మంతోపాటు ఈ జీవితాని కంతకూ గంగలో కలిపింది. ఈ జీవితంలో ఎన్నో కాంక్షలు, ఎన్నో కోరికలు! విధవ అయినంతమాత్రంచేత అవి పోవు. అందుచేతనే మాధవి అప్పుడప్పుడూ భర్త చెప్పిన మాటలు తలపుకు తెచ్చుకొంటుంది. వారు లేనప్పుడు ఇవన్నీ ఎందుకు? ఎవరికోసమై ఇతరులను హింసించాలి? ఎవరికోసమై ఇతరుల కళ్ళవెంట నీరుకార్పించాలి? అసలు ఇటువంటి హీనప్రవృత్తులు ఆమెలో ఎప్పుడూ లేవు. గొప్పఇంటిపిల్ల-ఆమెకు తీరని కోరికలంటూ లేవు; అసూయాద్వేషాలు ఆమె ఎరగనే ఎరగదు.

ఆమె ఉద్యానవాటికలో అనేక పుష్పాలు వికసించేవి. పూర్వం ఆ పుష్పాలను దండగుచ్చి భర్తమెడలో వేసేది. ఇపుడు భర్త లేడు. అలాగని ఆమె పూలచెట్లను కొట్టివేయ లేదు. ఇప్పుడుకూడా వాటిన పూలు పూస్తున్నవి. భూమి మీద రాలిపడుతున్నవి. ఇప్పుడామె మాల గుచ్ఛనిమాట సత్యం; కాని పోగుచేసి, దోసెళ్ళతో దీనులకు పంచిపెడుతూ వుంటుంది. లేనివారికల్లా యిస్తుంది. కొంచెంకూడా కృపణత్వం లేదు, ముఖవికృతి లేదు.

వ్రజబాబుభార్య చనిపోయిననాటినుంచీ, కుటుంబంలో ఒక క్రమపద్ధతి ఏదీలేదు. ఎవరిగొడవలో వారుండేవారు.

ఒకర్ని ఒకరు చూసేవారు కాదు; ఒకరికొకరు తోడ్పడే వారుకాదు! అందరికీ తలా ఒకనౌకరూ ఉండేవాడు. నౌకర్లే వాళ్ళవాళ్ళ యజమానుల పనులుచూస్తూ ఉండేవాళ్లు. వంట శాలలో వంటవారు వంటచేసేవారు. పెద్దఅన్నసత్రంలోవలె ఆకులు పరుచుకొని అందరూ కూర్చునేవారు. దొరికినవారికి దొరికేది—లేనివారికి లేదు. దొరకనివాడిసంగతి విచారించే వాడే లేడు. కాని ఏనాడైతే మాధవి భాద్రపదమాసపు నిండుగంగవంటి రూపమూ, స్నేహమూ, మమతతో తండ్రి యింటికి వచ్చిందో—ఆనాటినుంచీ ఈ కుటుంబంలో మళ్లా కొత్త వసంతం అంకురించింది. ఇప్పుడు అందరూ 'బడదీదీ' అనేవారే. అందరూ మాధవి అనేవారే—ఇంటి పెంపుడు కుక్కతోసహా ప్రొద్దుకుంకేలోపల ఒకమాటు 'బడదీదీ'ని చూడాలనేదే! ఇంతమందిలో ఆమె ఒక్కతే స్నేహమయి: సర్వమయి! ఇంటియజమాని దగ్గరనుంచి మేనేజరు, గుమస్తా, దాసదాసీలు, అందరూ బడదీదీని తలచేవారే! అందరూ ఆమె మీద ఆధారపడి ఉండేవారే! ఏ కారణంవల్లనైనా కానీండి. 'బడదీదీ'మీద తమకు ఒక హక్కు ఉన్నదని అందరూ ఎంచే వారు. స్వర్గంలోవుండే కల్పతరువును మనము ఎప్పుడూ చూడలేదు, చూస్తామో లేదోకూడా మనము ఘట్టిగా చెప్పలేము కాని వ్రజబాబు కుటుంబంలోవుండే వ్యక్తులకు మాత్రం ఒక కల్పతరువు లభించింది; క్రిందకుపోయి చేయి చాచేవారు—నవ్వుముఖంతో తిరిగివచ్చేవారు.

ఇలాంటి పరివారంలో సురేంద్రుడుకూడా ఒక నూతన పక్షిగా జీవితం గడుపనారంభించాడు అందరూ ఒక వ్యక్తి

మీదనే భారంవేయటంచూచి ఇతనుకూడా వారిని అనుస రించాడు. కాని ఇతరులకూ ఇతనికీ కొంత తేడావున్నది. ఇతని నమ్మకం, బడదీదీ అనే జీవితపదార్థం ఒకటి ఈ ఇంట్లో వున్నది, అందరినీ కనిపెట్టివుంటుంది; అందరి కోరికలూ నెరవేరుస్తూ ఉంటుంది; ఏది కావలసినా అక్కడ దొరుకు తుంది; అని!

తన అవసరాలకోసం తానే ఆలోచించవలసి వుంటుందని, కలకత్తా బజారుల్లో తిరిగేటప్పుడు సురేంద్రుడు కాస్త గ్రహించాడు. కాని ఇక్కడకు వచ్చినాక మళ్ళీ గత జీవితమంతా మరచిపోయాడు—ఒకప్పుడు తలచవలసి వస్తుందనికూడా తలచలేదు.

చొక్కాలు, ధోవతులు, గొడుగు, చేతికర్ర, చెప్పులు, ఇలాంటి అవసరమైన వస్తువులు ఇతనికి కావలసినన్ని లభించినవి. భోంచేయటమే తడవుగా చేతులు తుడుచుకోవటానికి రుమాలుకూడా అతనికోసం సిద్ధంగా ఉండేది. కొత్తలో అతనికి ఆశ్చర్యంవేసి ఇవన్నీ ఎక్కడనుంచి వచ్చినవని అడిగే వాడు. 'బడదీదీ' పంపిందని జవాబువచ్చేది. ఫలహారాల పళ్ళేనికికూడా బడదీదీ స్పర్శ తగిలిందని ఇపుడతడు చూడ గానే గ్రహించేవాడు. ఒకనాడు లెఖ్ఖలు వేసేటప్పుడు కంపాస్ కావలసివచ్చి ప్రమీలతో—"ప్రమీలా! బడదీదీని అడిగి కంపాస్ తెచ్చిపెట్టు" అన్నాడు.

కంపాస్‌తో బడదీదీకి అవసరం ఉండదు. అది ఆమెదగ్గర లేదుకూడా. కాని, వెంటనే దానికోసం బజారుకు మనిషిని పంపింది. సాయంకాలం సురేంద్రుడు షికారుకుపోయి తిరిగి

వచ్చేవరకు అతను కోరినవస్తువు టేబిలుమీద ఉన్నది.

మర్నాటి ఉదయం ప్రమీల—"మాస్టరుగారూ! నిన్న అక్కయ్య దీన్ని పంపింది" అన్నది.

తర్వాతకూడా అప్పుడప్పుడు సురేంద్రుడు ఒకటీ అరా ఇలాంటి వస్తువులే కోరుతూ ఉండేవాడు. మాధవి వాటికోసం చాలా చిక్కులు పడుతూ ఉండేది. చాలాచోట్ల తిరిగితేకాని ఇతని కోరికలు నెరవేరుతూ ఉండేవికావు. కాని ఎప్పుడూ 'లేదు' అనే జవాబురాలేదు. ఎప్పుడన్నా హఠాత్తుగా ప్రమీలతో "బడదీది దగ్గరికిపోయి నాలుగైదు పాతగుడ్డలు తీసుకురా, బిచ్చగాళ్ళకివ్వాలి!" అనేవాడు. కొత్తాపాతా అనేతేడా మాధవికి ఎప్పుడూ ఉండదు. ఆమె తన గుడ్డలే ఇదిచ్చిపంపి, పైఅంతస్తు కిటికీదగ్గర నిలబడిచూసేది. నలుగురైదుగురు దీనులు సంతోషంతో దీవనలిస్తూ వెళ్లుతుండేవారు; వాటికి గుడ్డలు లభించినవి.

కోరికలరూపంలో ఉన్న ఇలాంటి చిన్నచిన్న-అత్యాచారాలు మాధవి నిత్యమూ సహిస్తూవుండేది. ఆమె క్రమంగా వీటి కలవాటుపడింది. ఒక కొత్తజీవం వచ్చి తన నిత్యకార్యకలాపాల్లో చిన్నచిన్న కొత్త ఉపద్రవాలు తెచ్చిపెట్టుతున్న దన్న తలంపుకూడా ఆమెకు ఉండేదికాదు. ఇంతేకాదు! ఈ జీవంకోసం మాధవి ఇప్పుడు చాలా జాగరూకతతో ఉండవలసివచ్చింది. ప్రతివస్తువూ అతను ఇలా అడిగి తెప్పించుకుంటే మాధవికి సగం శ్రమతగ్గేది. సురేంద్రుడు తనకు కావలసిన వస్తువులేవీ అడగడు. అతనికి కావలసిన వాటిని గురించి ఈమే ఆలోచించవలసిఉండేది. సురేంద్రుడు అన్య

మనస్కుడని మొదట ఈమెకు తెలియదు. టీ చల్లారిపోతున్నా తాగేవాడు కాడు; తినుబండారాలేవీ ముట్టుకునేవాడు కాడు- కుక్కకు మాంతి పెట్టుతూఉండేది. భోజనానికి కూర్చున్నపుడు పిండివంటలకూ మామూలు భోజనానికీ అట్టే తేడా ఉంచే వాడు కాడు. ప్రక్కకు నెట్టివేసేవాడు. నౌకరువచ్చి-"మా స్టరుగారు పిచ్చివారు! వారి కేమీ తెలియదు, ఎప్పుడూ పుస్తకం ముందు వేసుకు కూర్చుంటారు!" అని మాధవికి చెప్పేవాడు.

వ్రజబాబు మధ్యమధ్య ఉద్యోగం విషయమై అడుగుతూ ఉండేవాడు. సురేంద్రుడు అయినట్లూ పోయినట్లూ జవాబు లిచ్చేవాడు. తండ్రిగారి దగ్గర విన్నమాటలనుబట్టి మాధవి గ్రహించినదేమంటే ఉద్యోగం కోసం మాస్టరుగారేమీ ప్రయత్నం చేయటంలేదు, ప్రయత్నించాలనే కోరికకూడా ఉన్నట్టు కనబడదు, అతను దొరికినదానికే తృప్తిపడ్డాడుఅని.

పది కొట్టగానే స్నానంచేయమని బడదీదీదగ్గరనుంచి తాకీదు వచ్చేది. బాగా భుజించకపోతే బడదీదీ తరఫున ప్రమీలవచ్చి బ్రతిమాలేది. ఎక్కువ పొద్దుపోయిందాకా చదువుతూ కూర్చుంటే నౌకరువచ్చి లైటు ఆర్పివేసేవాడు వారిస్తే వినేవాడు కాడు-"బడదీదీ కా హుకుమ్!" అనేవాడు.

ఒకరోజున మాధవి నవ్వుతూ-"నాన్నా! ప్రమీల ఎలాంటిదో దాని పంతులుకూడా అలాంటివాడే!" అని తండ్రితో అన్నది. "ఎందుకని, తల్లీ?" అన్నాడు వ్రజబాబు.

"ఇద్దరూ పిల్లలే. మన ప్రమీలకు ఏమి తినవలసిందీ, ఎప్పుడు పండుకోవలసిందీ, ఏది చేయకూడందీ ఎలా తెలియదో-అలాగే దానిమాష్టరుకుకూడా ఏమీ తెలియదు.

పైగా సమయాసమయాలు గుర్తించకుండా అవీ ఇవీ అడుగుతూ ఉంటాడు—కాస్త జ్ఞానం ఉన్నవాళ్ళెవరూ అలా అడగరు.''

వ్రజబాబుకు ఏమీ అర్థంకాలేదు. ముఖంవంకచూస్తూ ఊరుకున్నాడు. మాధవి నవ్వుతూ—''మన అమ్మాయికి ఎప్పుడేది కావాలో తెలుసునా?'' అని అడిగింది.

''తెలియదు.''

''వేళకాని వేళను ఏదన్నా లేంది తెమ్మనిహారం వేస్తుందా?''

''వేస్తుంది.''

''మాష్టరుగారుకూడా అంతే!''

''కుర్రవాడుకాస్త పిచ్చివాడిలాగా కనపడుతున్నాడు.'' అన్నాడు వ్రజబాబు నవ్వుతూ.

''పిచ్చివాడుకాదు, నాన్నా! భాగ్యవంతుడి పిల్లవాడు లాగా ఉన్నాడు.

''ఎలా తెలుసుకున్నావు?'' అన్నాడు తండ్రి ఆశ్చర్యంతో.

మాధవికి తెలియదు. కాని ఊహించింది. సురేంద్రుడు తనపనేదీ తాను చేసుకునేవాడుకాదు. ఇతర్లమీదనే ఆధారపడి ఉండేవాడు. వాళ్లుచేస్తే చేసినట్టు—లేకపోతే లేదు. ఈ స్వభావమే ఈమెదగ్గరపట్టి ఇచ్చింది. ఇది అతని పూర్వ అభ్యాసం కావచ్చని ఈమె అనుకొన్నది. ఆహారపద్ధతి మాధవిని ఇంకా చకితను చేసింది. ఏ పదార్థమూ అతన్ని ఆకర్షించేదికాదు; దేన్నీ అతను తృప్తిగా భుజించేవాడు కాదు; దేనిమీదా అతనికి అపేక్షలేదు! వృద్ధునిమాదిరి వైరాగ్యం, బాలకునివంటి అమాయకత్వం, పిచ్చివానివలె

ఉపేక్ష—తినటానికి ఇస్తే తినేవాడు, లేకపోతే లేదు! ఇది ఈమె కేమీ అర్థమయ్యేది కాదు. అందుచేతనే, ఈమె పరోక్షంగా కనిపెట్టి ఉండేది. ప్రత్యక్షంగా చూడకపోవటం ఈమె సిగ్గుపడి కాదు, అవసరం లేకపోవటంచేతనే చూడటం లేదు. అవసరంవచ్చినపుడు సమయాసమయాలు వుండవు. వెంటనే 'బడదీదీ' దగ్గరకు కబురుపోతుంది ? మాధవి మందహాసంచేసి, "అమాయకుడు!" అనుకుంటుంది.

## ౪

మనోరమ మాధవికి బాల్యసఖి. చాలాదినాలనుంచి ఆమె ఉత్తరానికి మాధవి జవాబివ్వలేదు, అందుకని మనోరమకు చాలా కోపంకూడా వచ్చింది. ఇవ్వాళ మధ్యాహ్నం కాస్త తీరిక చేసుకుని మాధవి ఉత్తరం వ్రాయటానికి కూర్చున్నది. ఇంతలో ప్రమీలవచ్చి—"బడదీదీ!" అన్నది.

మాధవితలఎత్తి, "ఏమిటే, ప్రమీలా!" అని అడిగింది.

"మాష్టరుగారి కళ్లజోడు ఎక్కడో పోయింది, ఒకటివ్వు"

మాధవి నవ్వుతూ, "నేనిక్కడ కళ్ళజోళ్ళ దుకాణం పెట్టుకుకూర్చో లేదని మీ మాష్టరుగారితో చెప్పు!" అని అన్నది. ప్రమీల వెళ్ళిపోతూవున్నది. మాధవి మళ్ళీ పిలిచి "ఎక్కడికిపోతున్నావు?" అని అడిగింది.

"మాష్టరుగారితో చెప్పటానికి."

"చెప్పవద్దులే. నువ్వుపోయి మేనేజర్ను పిలుచుకురా."

మేనేజరు వచ్చినతర్వాత—"మాష్టరుగారి కళ్ళజోడు పోయిందిట. మంచిది చూసి ఒకటి తెచ్చిపెట్టండి." అని

చెప్పింది.

మేనేజరు వెళ్ళిపోయినతర్వాత ఉత్తరం పూర్తిచేసింది: "ప్రమీలకోసం నాన్నగారు ఒక పంతుల్ని కుదిర్చారు. అతన్ని పెద్దవాడూ అనవచ్చు. పసిపిల్లవాడూ అనవచ్చు. ఇంతకుపూర్వం ఎప్పుడూ ఇల్లువదిలినవాడిలా కనపడటం లేదు, తూర్పూ పడమరా తెలుసుకోలేడు. అతన్ని కనిపెట్టుతూ ఉండకపోతే ఒక్క క్షణంకూడా జరగదు. సగం కాలం అతని కోసమే వినియోగించవలసి వస్తున్నది. నీకింకా ఉత్తరం ఎప్పుడు వ్రాసేది? నువ్విక్కడకు త్వరలో వచ్చేటట్లయితే ఆ వ్యక్తిని చూపిస్తాను. ఇంత అకర్మణ్యుణ్ణీ అన్యమనస్కుణ్ణీ నువ్వీజన్మలో చూసివుండవు! తినటానికి ఇస్తే తింటాడు, లేకపోతే ఉపవాసం ఉంటాడు. ఒక రోజల్లా భోజనం పెట్టకుండా ఉన్నా అతనికి భోంచేసిందీ లేందీ తెలియదు! ఒక్క రోజుకూడా అతనికతను జరుపుకోలేడు. ఇటువంటివ్యక్తి ఇల్లు ఎందుకు వదిలాడా అని నేను ఆలోచిస్తూ వుంటాను. అతనికి తల్లిదండ్రులుకూడా ఉన్నారని విన్నాను. కాని వాళ్లవి పాషాణహృదయాలు కావచ్చును. నాలాంటివారైతే అటువంటి వ్యక్తిని కనుమరుగుకూడా కానిచ్చేవారు కారు!"

మనోరమ తమాషాగా జవాబు వ్రాసింది.

"నీఉత్తరం అందింది. సంగతులు తెలిసినవి. ఇంట్లో ఒక కోతిని పెంచి నువ్వు దానికి సీతాదేవివయావని గ్రహించాను. ఎందుకైనా మంచిది, కొంచెం జాగర్తగా ఉండమని నిన్ను హెచ్చరిస్తున్నాను! ఇంతే—మనోరమ."

ఉత్తరంచదివేవరకు మాధవిముఖం కొంచెం ఎఱ్ఱబడింది.

"దగ్ధముఖివి ఎవరితో సరసమాడాలో కూడా నీకు తెలియదు!" అని వెంటనే జవాబు వ్రాసింది.

• • •

"ప్రమీలా? మీ మాష్టరుగారి జోడు ఎలా ఉన్నది?" అని మాధవి అడిగింది.

"భేషుగ్గా ఉంది!"

"ఎలా తెలుసుకున్నావు?"

"మాష్టరుగారు ఎప్పుడూ ఆజోడు పెట్టుకొనే పుస్తకాలు చదువుతూ ఉంటారు. దాన్నిబట్టి తెలుసుకున్నాను."

"వారేమీ అనలేదా?"

"అనలేదు."

"ఒక్కమాటకూడా? బాగున్నదీ—లేనిదీ—ఏదనీ?"

"ఉహూఁ! ఏమీ అనలేదు."

సదా సంతోషంగా ఉండే మాధవి ముఖం ఒక్క క్షణ కాలం మలినమయింది; కాని వెంటనేనవ్వి, "మళ్ళీ పోగొట్టుకోవద్దని మీ మాష్టరుగారితో చెప్పు," అన్నది.

"అలాగే చెప్తాను."

"పో పిచ్చిదానా! అలాచెప్పవచ్చా? వారు మనసులో ఏమన్నా అనుకోరూ?"

"అయితే చెప్పవద్దంటావా?"

"వద్దు."

శివచంద్రుడు మాధవి అన్న. ఒకరోజున మాధవి అతన్ని పట్టుకొని, "దాదా! ప్రమీలపంతులు రాత్రింబగళ్లు చదువుతూఉండే దేమిటో నీకు తెలుసునా?" అని అడిగింది.

శివచంద్రుడు బి. ఏ. చదువుతున్నాడు. ప్రమీలాలకు చదువుచెప్పేరకం పంతుళ్ళంటే అతనికి లెఖ్ఖలేదు— "నాటకాలూ నావెల్సూ చదువుతాడు! ఇంకేమి చదువుతాడు?" అన్నాడు ఉపేక్షగా.

మాధవికి నమ్మకం కలుగలేదు. ప్రమీలచేత ఒక పుస్తకం చాటుగా తెప్పించి అన్నకిచ్చి "ఇది నాటకమూ, నావెలూగా కనపడటంలేదే!" అని అన్నది.

పుస్తకం అంతా తిరగవేసి చూచినా శివచంద్రునికి ఏమీ అర్థంకాలేదు. అదొక లెఖ్ఖల పుస్తకం అని మాత్రం గ్రహించాడు. చెల్లెలిదగ్గర గౌరవం పోగొట్టుకోవటం ఏమీ ఇష్టంలేక—"ఇది లెఖ్ఖలపుస్తకం. స్కూళ్ళలో చిన్న క్లాసులకు చెపుతూ ఉంటారు" అన్నాడు.

మాధవి విషణ్ణవదనంతో, "కాలేజీలో చెప్పేదికాదా?" అని అడిగింది.

"ఎబ్బే! ఏమాత్రం కాదు."

శివచంద్రుడు ఆనాటినుంచి వీలైనంతవరకు ఎప్పుడూ సురేంద్రునికి కనపడేవాడుకాదు. ఏదైనా మాటలసందర్భంలో తనగుట్టు బయటపడితే, తానుకూడా ఉదయం ప్రమీలతోపాటు నోటుబుక్కూ పెన్సిలూ తీసుకొని అతని దగ్గర కూర్చోవలసి వస్తుందేమోనని ఇతని భయం.

కొన్నాళ్లు గడచిన తర్వాత ఒకనాడు మాధవి— "నాన్నా! నేను కొన్నాళ్ళపాటు కాశీలో ఉండివస్తాను" అని తండ్రిని అడిగింది.

వ్రజబాబు చింతితుడై—"అదెలాగు, తల్లీ! నువ్వు

కాశీకిపోతే ఇక్కడ సంసారమెలా?'' అన్నాడు.

''నేను మళ్ళీ తిరిగివస్తాను. అక్కడే ఉండిపోను!'' అన్నది మాధవి నవ్వుతూ.

మాధవి నవ్వుతూనే ఉన్నది కాని తండ్రి కళ్ళవెంట నీరు కారింది. తాను ఇలా మాట్లాడటం అన్యాయమేనని ఆమె గ్రహించి ''కాశీనుంచి వెంటనే తిరిగివస్తాను'' అన్నది.

''ఐతే పో, తల్లీ! కాని ఈ సంసారం నడవదు.''

''నేను లేకపోతే ఈ సంసారమే నడవదా?''

''ఎందుకు నడవదు, తల్లీ! నడుస్తుంది! చుక్కానీ విరిగిన పడవ నదిలో ఎలా నడుస్తుందో అలానే నడుస్తుంది.''

కాని ఈమె కాశీ వెళ్ళక తప్పదు. అక్కడ ఈమె విధవాడ పడుచు కొడుకుతో ఉంటున్నది. వారిని ఒకమాటు చూడాలి.

కాశీ వెళ్లేరోజున ఒక్కొక్కరినీ పిలిచి ఈ కుటుంబభార మంతా వప్పగించింది. ముసలిదాసీనిపిలిచి తండ్రినీ, అన్ననూ, ప్రమీలనూ కనిపెట్టి ఉండమని చెప్పింది. కాని మాష్టరు సంగతి ఎవ్వరికీ చెప్పలేదు, మరచిపోయికాదు, ఇలా చేయ వలెననే చేసింది. ఇప్పుడు మాధవికి కొంచెం కోపంగా ఉన్నది. అతనికొసం ఈమె చాలా శ్రమపడింది. కాని అతను నోటితో కాస్త కృతజ్ఞతన్నా తెలుపలేదు. అందుకనే మాధవి కాశీవెళ్లి-ఈ అకర్మణ్యుడికి, ఈ ప్రపంచానభిజ్ఞుడికి, ఈ ఉదాసీనుడికి-తాను ఒకతెనున్నానని తెలుపుతుంది. కొంచెం కౌతుకంచేసిచూస్తే వచ్చే నష్టమేమిటి? తను లేక పోతే అతనెలా గడుపుకుంటాడో కాస్త పరీక్షించినంత మాత్రంచేత తల్లక్రిందులయేదేమున్నది? అందుకనే ఈమె

సురేంద్రుని విషయమై ఎవ్వరికీ చెప్పిపోలేదు.

సురేంద్రుడు ప్రాబ్లం సాల్వ్ చేస్తున్నాడు. ప్రమీలవచ్చి, "అక్కయ్య రాత్రి కాశీ వెళ్లింది" అని చెప్పింది.

ఈమాట అతని చెవికెక్కలేదు. కాని మూడురోజుల తర్వాత అతనికి కొంచెం వెట్టతగిలింది-రెండు ఘంటలయినా అతన్ని భోజనానికి లేవమనేవారులేరు. స్నానంచేసిన తరువాత గుడ్డలు మార్చాలంటే ఉతికినవి ఉండేవికావు. ఫలహారాల పళ్ళెంలో పూర్వంనూదిరిగా వివిధ పదార్థాలు ఉండేవి కావు. రాత్రి లైటు ఆర్పటానికి ఎవ్వరూ వచ్చేవారుకారు; మూడు ఘంటలదాకా చదువుతూ ఉండేవాడు. ఉదయం నిద్ర తెలిసేదికాదు. లేచేవరకు చాలా ప్రొద్దు ఎక్కేది. పగలంతా నిద్రమత్తుగా వుండేది. శరీరం చాలా బడలిక చెందింది, తనలో ఇన్నిమార్పులు జరిగినాక ఈ కుటుంబంలో కొంత మార్పు జరిగిందని సురేంద్రుడు గ్రహించాడు. ఉక్కగా వున్నప్పుడే ఎవరైనా విసనకర్రకోసం వెతికేది! సురేంద్రుడు పుస్తకంనుంచి దృష్టిమరల్చి—"ప్రమీలా బడదీదీ ఇక్కడ లేదుకదూ?" అని అన్నాడు.

"అక్కయ్య కాశీ పోయింది."

"అదే—" అని ఊరకున్నాడు సురేంద్రుడు.

రెండురోజులున్న తర్వాత—"ప్రమీలా! బడదీదీ ఎప్పుడు వస్తుంది?" అని మళ్లీ అడిగాడు.

"ఒకమాసం వున్నాక."

సురేంద్రుడు మళ్లీ చదువులోపడ్డాడు. ఇంకో ఐదు రోజులు గడిచాయి. సురేంద్రుడు పెన్సిలు పుస్తకంలోపెట్టి

"ప్రమీలా! మాసం గడవటానికి ఇంకా ఎన్నిరోజు లున్నాయి" అని అడిగాడు.

"చాలారోజులు."

సురేంద్రుడు కళ్లజోడుతీసి అద్దాలు రెండూ తుడిచాడు. తర్వాత పుస్తకంవంకచూస్తూ కూర్చున్నాడు.

మర్నాడు—

"ప్రమీలా! నువ్వు బడదీదీకి వుత్తరం వ్రాశావా?"

"వ్రాశాను."

"త్వరగారమ్మని వ్రాయలేదా?"

"లేదు."

సురేన్ నిట్టూర్చి, మెల్లగా "అదే—" అని అన్నాడు.

"మాష్టరుగారూ! బడదీదీకి వుత్తరంవ్రాస్తే బాగుండదూ?" అని అడిగింది ప్రమీల.

"బాగుంటుంది."

"రమ్మని వ్రాసేదా?"

"వ్రాయి" అన్నాడు సురేంద్రుడు సంతోషంతో.

"మీ సంగతికూడా వ్రాయమంటారా?"

"వ్రాయి."

"వ్రాయి" అని చెప్పటానికి అతనికేమీ సంకోచంలేదు. ఎందుకంటె ఈ ప్రపంచంలోని రీతి రివాజులేవీ అతనికి తెలియవు. బడదీదీని రమ్మని కోరటం తనికి తగదని అతని కేమాత్రం తెలియదు. ఎవరు లేకపోతే తనకు చాలా కష్టంగావుంటుందో, ఎవరు లేకపోవటంచేత తనకు జరగటం లేదో వారిని రమ్మని వ్రాయటం అతని కేమాత్రం

అసంగతంగా తోచలేదు.

ఈ ప్రపంచంలో కుతూహలం లేనివారు సాధారణ జన సమాజానికి కొంచెం పెడగా వుంటారు. సామాన్య ప్రజలతో వారు కలసిమెలసి వుండలేరు. సాధారణుల అభిప్రాయాలతో వీరి అభిప్రాయాలు కలియవు. సురేంద్రునిది కుతూహల స్వభావం కాదు. ఎంతవరకు అవసరమో అంతవరకే తెలుసుకుంటాడు. అదిదాటి, ఇచ్ఛాపూర్వకంగా ఒక్కమాటకూడా తెలుసుకో దలచడు. అసలు తీరికకూడా వుండదు, అందువల్లనే, ఇన్నాళ్ళనుంచీ ఈ కుటుంబంలో వుంటూవున్నా బడదీదీ విషయమై అతనికేమీ తెలియదు! ఈమూడు మాసాలనుంచీ బడదీదీమీదనే భారంవేసి మహా సుఖంగా కాలం వెళ్లబుచ్చుతున్నాడు; కాని ఆ మనిషి ఎలాంటిదని అతనెవ్వరినీ అడగలేదు! ఎంత వయస్సున్నదీ, ఎంత ఎత్తున్నది, ఎలాంటి ఆకారం, ఎలాంటి గుణాలు—అతనికేమీ తెలియవు తెలుసుకోవాలనే కోరికకూడా లేదు. తెలుసుకోవలసిన అవసరం వున్నదనికూడా అతను ఎంచలేదు.

అందరూ బడదీదీ అంటారు, తానూ బడదీదీ అంటాడు! అందరూ ఆదరం పొందుతున్నారు, తనూ ఆదరం పొందుతున్నాడు! విశ్వభండారమంతా ఆమెదగ్గర దాచిపెట్టి వున్నది; కావలసినవారెల్లా తీసుకొంటున్నారు, సురేంద్రుడు కూడా తీసుకొంటున్నాడు! అందులో ఆశ్చర్యపడవలసిన విషయమేమున్నది? మేఘాలపని వర్షించటం; బడదీదీపని ఆదరాభిమానాలు చూపటం! వర్షం కురిసేటప్పుడు చేయి చాచినవారికెల్లా జలం లభిస్తుంది; బడదీదీముందు చేయి

చాచినవారికెల్లా ఈప్సితపదార్థం లభిస్తుంది! మేఘాల మాదిరిగా ఆమెకూడా అంధ; ఆకాంక్షాహీన!

స్థూలంగా ఆమెనుగురించి సురేంద్రుడిలానే అభిప్రాయ పడ్డాడు. ఈ అభిప్రాయం అతనికి వచ్చినప్పుడే పడిపోయింది, ఇప్పటివరకూ మారలేదు. ఆమె కాశీ వెళ్ళినప్పటినుంచీ "బడదీదీ" లేనిదే తనకొక క్షణంకూడా గడవదని అతను నిశ్చయించుకొన్నాడు.

సురేంద్రుడు ఇంటివద్ద వుండేటప్పుడు తల్లినీ తండ్రినీ మాత్రమే ఎరుగును. వాళ్ళ కర్తవ్యమేమిటోకూడా తెలుసును. బడదీదీ అని వేరుగా అతనెవర్నీ ఎరగడు. ఇక్కడకు వచ్చినతర్వాత బడదీదీ అంటే ఇలా వుంటుందని భావించాడు. మనిషిని అతను చూడలేదు—కాబట్టి ఆమెను ఎరగడు—పేరు తెలుసును-కాబట్టి పేరును గుర్తించగలడు. మనిషితో అతనికి అవసరంలేదు-పేరే అతనికి కావలసింది!

ఆరాధకులు ఇష్టదేవతను చూడకపోయినప్పటికీ, పేరు మాత్రం వ్రాసుకుని, కష్టనష్టాల్లో ఆ పేరు ముందు తమ హృదయాన్ని విప్పుతారు; మోకరించి కరుణాభిక్ష యాచిస్తారు; కన్నీరు తుడుచుకొని శూన్య దృక్కులతో ఎవరినో చూడదలచుకొంటారు, కాని ఏమీ కనబడదు—అస్పష్ట జిహ్వతో అస్ఫుటంగా ఏదో వుచ్చరిస్తారు? దుఃఖితుడైన సురేంద్రుడుకూడా ఇపుడలాగే వుచ్చరించాడు— "బడదీదీ!" అని.

౨

ఇంకా సూర్యోదయం కాలేదు. తూర్పుదిక్కు ఎర్రపడింది. ప్రమీల వచ్చి నిద్రపోతూవున్న సురేంద్రుని మెడ చేతులతో చుట్టి—"మాష్టరుగారూ!" అని పిలిచింది.

సురేంద్రుడు నిద్రమత్తుతో కళ్లను కొద్దిగా తెరచి, "ఏమిటి, ప్రమీలా?" అని అడిగాడు.

"బడదీదీ వచ్చింది."

సురేంద్రుడు లేచి ప్రమీలచేయి పట్టుకొని—"పద, చూసివద్దాము," అన్నాడు. చూడాలనే ఈ కోరిక అతని మనస్సులో ఎలా కలిగిందో చెప్పలేము. ఇన్నాళ్లతర్వాత అతను ప్రమీల చేయిపట్టుకొని కళ్లు తుడుచుకోంటూ లోపలికి ఎందుకు వెళ్లాడో కూడా అర్థంకాదు. ఎలాఅయినా కానీండి అతనుమాత్రం మెట్లెక్కి మాధవి గదిముందుకు వెళ్ళి—"బడదీదీ!" అని పిలిచాడు.

మాధవి అన్యమనస్కంగా ఏదో పనిచూచుకుంటూ వున్నది—"ఏమిటే చెల్లీ?" అని ప్రమీలను అడిగింది.

"మాష్టరుగారు—" అప్పటికి ఇద్దరూ లోపలికి వచ్చేశారు. మాధవి తత్తరపాటుతో లేచి తలమీదకు ముసుగు లాక్కొని ఒకమూలకుపోయి నిలబడింది.

సురేం—"నీ మూలాన చాలా కష్ట—"

మాధవి ముసుగులోనే, సిగ్గుపడి నాలుక కొరుక్కొని "ఛీ, ఛీ" అనుకొన్నది.

"నీవు వెళ్ళిపోయినాక—"

ఎంతసిగ్గు!' అని మాధవి మనస్సులో అనుకొని. 'ప్రమీలా, మాష్టరుగారిని బయటకు పొమ్మని చెప్పు.' అన్నది మెల్లగా. ప్రమీల చిన్నదైనప్పటికీ చేసింది మంచి పని కాదని అక్కయ్య ప్రవర్తనను బట్టి గ్రహించి, 'పదండి, మాష్టరుగారూ,' అన్నది.

సురేంద్రుడు కాసేపు అప్రతిభుడై అలాగే నిలబడి తర్వాత, 'పద' అని అన్నాడు.

ఎక్కువమాట్లాడటం అతని చేతకాదు. ఎక్కువ చెప్పాలనికూడా లేదు అతనికి. పగలంతా మేఘాలు సూర్యుని కమ్మివుంటే, అందరూ అతన్నే చూడాలని ఎందుకు అనుకుంటారో, ఒక్క క్షణం కూడా సూర్యుని మనం చూడకూడదనీ, చూస్తే కళ్ళకు బాధగా వుంటుందనీ ఎలాతలచరో అలాగే, ఒకమాసం మేఘాలచాటునఉన్న ప్రథమ సూర్యోదయాన్ని సురేంద్రుడుకూడా మహా ఆనందంతో చూడబోయాడు. దాని పరిణామాన్ని గురించి అతను ఆలోచించనే లేదు.

ఆనాటినుంచీ అతనికి కొంచెం ఆదరం తగ్గింది. మాధవి కొంచెం సిగ్గుపడుతూ ఉండేది. బిందూ ఒకనాడు ఈ ప్రసంగం ఎత్తి మాధవిని కాస్త గేలికూడా చేసింది. సురేంద్రుడు చాలా చిన్నబోయినాడు. బడదీదీ అసీమభండారము ససీమమైందని కూడా గ్రహించాడు. సోదరీప్రేమ ఇపు డీతనిదాకా రావటంలేదు. కొంచెం దూరంనుంచే తిరిగిపోతున్నది.

ఒకరోజున ప్రమీలను–'ప్రమీలా! నామీద బడదీదీకి కోపంగా ఉన్నది కాదూ?' అని అడిగాడు.

'ఎందుకు ?'

'మీరు ఇంట్లోకి అలా ఎందుకు వెళ్లారు ?'

'పో కూడదు కదూ ?'

'పోవచ్చా మరి ? అక్కయ్యకు చాలా కోపంగాఉంది.'

సురేన్ పుస్తకం మూసేసి 'అదే' అని అనుకున్నాడు.

ఒకనాటి మధ్యాహ్నం జోరున వర్షం కురుస్తూఉన్నది. వ్రజబాబు రెండురోజులనుంచి ఇక్కడ లేదు—జమీందారీ చూడటానికి వెళ్ళాడు. మాధవికి చేతిలో పని లేదు. ప్రమీల చాలా గోలచేస్తూ ఉన్నది. మాధవి ప్రమీలను పిలిచి— 'నీపుస్తకాలు తీసుకురా, ఏమిచదువుతున్నావో ఒకమాటు చూస్తాను,' అని అన్నది.

ప్రమీల కొయ్యబారిపోయింది. మాధవి మళ్ళీ 'తీసుకురా!' అని గద్దించింది.

'రాత్రికి తెస్తాను, అక్కయ్యా!'

'కాదు. ఇప్పుడే తీసుకురా.'

చాలా అయిష్టంతో ప్రమీల పుస్తకాలు తీసుకువచ్చి 'మాష్టరుగారు చదువు చెప్పటంలేదు. ఎప్పుడూ వారే చదువు కుంటారు,' అని అన్నది.

మాధవి కొన్ని ప్రశ్నలు అడిగింది. సమాధానాలు లేవు. మాష్టరుగారు చదువు చెప్పనిమాట నిజమేనని గ్రహించింది. పైగా అదివరకున్న చదువుకూడా, ఈ పంతుల్ని పెట్టిన నాలుగు మాసాలలో మరచిపోయింది. మాధవి విసుక్కుని బిందూను పిలిచి 'బిందూ! ఇన్నాళ్ళనుంచీ ప్రమీలకు చదు వెందుకు చెప్పటంలేదో మాష్టరుగారిని పోయి అడిగిరా,'

అని పంపింది.

బిందు అడగటానికి వెళ్ళినప్పుడు మాష్టరు ప్రాబ్లము సాల్వ్ చేస్తున్నాడు. 'మాష్టరుగారూ! మీరు చిన్నమ్మాయికి చదువు ఎందుకు చెప్పటంలేదో, బడదీదీ అడిగిరమ్మన్నది?' అని బిందూ అన్నది.

మాష్టరుగారు వినిపించుకోలేదు. ఈ తఫా బిందూ ఇంకా బిగ్గరగా—'మాష్టరుగారూ!' అని పిలిచింది.

'ఏమిటి?'

'బడదీదీ అడిగి రమ్మన్నది?'

'ఏమి అడిగి రమ్మన్నది?'

'చిన్నమ్మాయికి చదువెందుకు చెప్పటంలేదని?'

'బాగాఉండటంలేదు' అని అన్నాడు అన్యమనస్కంగా.

బిందూ ఈమాటలకు ఇంకాకాస్త మసాళాకలిపి మాధవికి అంటించింది. మాధవికి కోపంవచ్చింది. ఆమె వెంటనే కిందికి దిగివచ్చి తలుపుచాటున ఉండి. బిందూచేత అడిగించింది. 'చెల్లికి చదువెందుకు చెప్పటంలేదు?' అని.

ఈ ప్రశ్న రెండుమూడుసార్లు అడిగినతర్వాత సురేంద్రుడు—'నావల్లకాదు!' అన్నాడు.

సమాధానంలో మాధవికి తలబిరుసుతనం కనిపించింది. 'వల్లకాకపోతే, ఇక్కడ ఎందుకోసం ఉంటున్నారు?' అని అడిగించింది.

'ఉండకపోతే ఎక్కడకు పోయేది?'

'మరి చదువెందుకు చెప్పరు?'

సురేంద్రునికి ఇప్పుడే కాస్తచైతన్యం కలిగింది. బిందూ

వంకకు తిరిగి—'ఏమిటి నువ్వు అడిగేది?' అనిఅడిగాడు.

బిందు ఇంతసేపటినుంచి చెప్పిందే మళ్ళా ఇంకోమాటు చెప్పింది.

'రోజూ చదువుకుంటున్నదిగా!' అన్నాడు సురేంద్రుడు.

'చదువుకుంటున్నది! కాని మీరెందుకు చెప్పటంలేదు?'

'నాకు తీరికలేదు.'

'మరి ఈఇంట్లో ఉండటం దేనికి?'

సురేంద్రుడుకూడా ఈసంగతే ఆలోచిస్తున్నాడు.

'మీరిక చదువు చెప్పరా?'

'ఉఁహు! చదువు చెప్పటం అంటే నాకు బాగుండదు.'

మాధవి లోపలనుంచి—'అడుగు, బిందూ! చదువు చెప్పుతున్నా ననే నెపంతో ఇన్నాళ్ళ నుంచీ ఎందు కున్నారో,' అని అన్నది. బిందు అదే అడిగింది.

ఇది వినేవరకు సురేంద్రుని ప్రాబ్లముల జాలం ఒక్క సారిగా తుత్తునియలై పోయింది. కొంచెం దుఃఖంకూడా కలిగింది. కాసేపు ఆలోచించి, 'అదే చాలా పొరపా టయింది,' అన్నాడు.

'ఈ నాలుగు మాసాలనుంచీ పొరపాటేనా?'

'ఆ. అలానే కనపడుతున్నది. చదువుసంగతి నాకు జ్ఞాపకమే రాలేదు.'

మర్నాడు ప్రమీల చదవటానికి రాలేదు. ఈ సంగతి సురేంద్రుడు గమనించలేదు. ఆమర్నాడుకూడా ప్రమీల రాలేదు. ఆనాడుకూడా అంతే, మూడోనాడు ప్రమీల రాక పోవటం చూసి, ప్రమీలను పిలుచుకు రమ్మని ఒక నౌకరుతో

చెప్పాడు. నౌకరు లోపలనుంచి తిరిగివచ్చి, 'చిన్నమ్మాయి గారు ఇక మీ దగ్గిర చదవరంట,' అన్నాడు.

'మరి ఎవరిదగ్గిర చదువుతుంది?'

'ఇంకో మాష్టరు వస్తాడు,' అని నౌకరు తన బుద్ధినంతా వినియోగించి జవాబిచ్చాడు.

అప్పుడు తొమ్మిది ఘంటలై ఉంటుంది. సురేంద్రుడు కొంచెంసేపు ఆలోచించి, రెండుమూడు పుస్తకాలు చంకను పెట్టుకుని లేచి నిలబడ్డాడు. కళ్ళజోడు కేసులోపెట్టి టేబిలు మీద ఉంచి మెల్లగా బయలుదేరాడు.

'మాష్టరుగారూ! ఈవేళప్పుడు ఎక్కడికండీ పోతున్నారు?' అని నౌకరు అడిగాడు.

'బడదీదీతో చెప్పు, నేను పోతున్నానని,'

'మళ్ళీ రారా?'

సురేంద్రుడు ఈమాట వినలేదు. జవా బివ్వకుండా తలవాకిలి దాటి వెళ్ళిపోయాడు.

రెండుఘంటలయినా సురేంద్రుడు తిరిగిరాలేదు. అప్పుడు నౌకరు పోయి మాధవితో మాష్టరుగారు వెళ్ళిపోయారని చెప్పాడు. 'ఎక్కడకు వెళ్ళిపోయారు?' అన్నది మాధవి.

'ఆ సంగతి తెలియదు, తొమ్మిదిఘంటలకు వెళ్ళిపోయారు, పోబోయేటప్పుడు నేను వెళ్లుతున్నానని బడదీదీతో చెప్పు, అని వెళ్ళిపోయారు.'

'అదేమిటిరా! భోంచేయకుండానే వెళ్ళిపోయారా?' అని కొంచెం ఉద్రేకంతో అడిగింది. తర్వాత ఆమె సురేంద్రుని గదిలోకి వచ్చి చూసింది. వస్తువులు ఎక్కడివి

అక్కడే ఉన్నవి. కళ్ళజోడుకూడా టేబిల్ మీద వుంది. కొన్ని పుస్తకాలుమాత్రం లేవు.

పొద్దు కుంకింది. సురేంద్రుడు రాలేదు. మర్నాడు ఇద్దరు నౌకర్లను పిలిచి—'మాష్టరుగారిని గనక వెతికి తీసుకువస్తే మీకు పదిరూపాయలు బహుమానం ఇస్తాను' అని మాధవి చెప్పింది. బహుమానానికి ఆశపడి నౌకర్లు పరుగెత్తారు. కాని సాయంకాలం నిరాశతో తిరిగివచ్చి జాడ ఏమీ చిక్క లేదని చెప్పారు.

'బడదీదీ! మాష్టరుగారు వెళ్ళిపోయింది ఎందుకు?' అని ప్రమీల ఏడుస్తూ అడిగింది.

మాధవి ప్రమీలను— 'ఏడవమాకు, బయటకుపో!' అని అవతలకు పంపింది.

రెండు మూడు రోజులు గడిచాయి. రోజులు గడిచిన కొద్దీ మాధవి ఉద్విగ్నతకూడా హెచ్చింది.

'బడదీదీ! అతనికోసం ఎందుకింత వెతకటం? కలక త్తాలో ఇక మాష్టర్లే దొరకరా?' అన్నది ఒకనాడు బిందు.

'ఫో, అవతలికి! చేతిలో దమ్మిడీ లేకుండా ఇట్లు వదలి పెట్టిపోతే, నువ్వు అతని కోసం ఎందు కింత వెదకటం అంటావా?' అని మాధవి చాలాకోపంతో అన్నది.

'అతనిదగ్గర దమ్మిడీకూడా లేదని నీకెట్లా తెలుసు.'

'ఆసంగతి నాకు తెలుసు! కాని, నీకీ అనవసరప్రసంగ మంతా ఎందుకు?'

బిందు మాట్లాడకుండా వెళ్లిపోయింది. వారంరోజులు గడిచాయి, కాని సురేంద్రుడు తిరిగి రాలేదు. మాధవి ఒక

విధంగా అన్నపానాదులు వదిలివేసింది. సురేంద్రుడు ఉపవాసాలు చేస్తున్నాడని ఆమె అనుకొనేది. ఇంటిలోని వస్తువే అడిగి తినలేనివాడు ఇతర్లను యాచించగలడా ? సురేంద్రుని దగ్గర కొని తినేటందుకు డబ్బూ, బిచ్చమెత్తేటందుకు తెలివి తేటలూ లేవని ఆమెకు పెద్దనమ్మకం. పోతే అతను అసహాయ స్థితిలో ఏదన్నా ఫుట్ పాత్ మీద కూర్చుని చిన్నపిల్లవాడివలె ఏడుస్తూనైనా ఉండాలి; లేదా ఏ చెట్టుకిందనైనా పుస్తకాలు తలకింద పెట్టుకొని నిద్రపోతూనైనా ఉండాలి.

వ్రజబాబు ఇంటికి తిరిగి వచ్చినాక ఈసంగతంతా విని 'చేసింది మంచిపని కాదు, తల్లీ!' అని తనఅభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు.

మాధవి చాలాకష్టంతో కన్నీరు ఆపు కొన్నది.

* * *

ఇటు సురేంద్రుడు ఊరక రోడ్లవెంట తిరుగుతూఉన్నాడు. మూడురోజులనుంచీ ఏమీ తినలేదు. పైపునీళ్లకు పైసా ఇవ్వనక్కరలేదు. ఆకలి అయినప్పుడెల్లా అవే కడుపునిండా తాగేవాడు. ఒకనాటిరాత్రి అలసినదేహంతో కాళీఘాటుకు పోతూన్నాడు—అక్కడ భోజనం దొరుకుతుందని ఎవరో చెప్పారు. చీకటిరాత్రి పైగా మేఘాలు దట్టంగా కమ్మిఉన్నవి. చౌరంగీదగ్గర మలుపు తిరుగుతూఉండగా ఒక గుర్రపు బగ్గీ వచ్చి అతనిమీద పడింది. సైసు గుర్రాలను ఏదోవిధంగా ఆపాడు. సురేంద్రునికి ప్రాణం పోలేదు. కాని రొమ్ము మీదా ప్రక్కటెముకల్లో పెద్దదెబ్బ తగిలింది. స్పృహతప్పి పడిపోయాడు. పోలీసులు అతన్ని బండి ఎక్కించి ఆస్పత్రిలో

చేర్చారు. మూడు నాలుగు రోజులు చైతన్యం లేకుండా ఉన్నాడు. నాలుగోనాటిరాత్రి కళ్లు తెరచి—'బడదీదీ!' అన్నాడు.

ఆవాళ నైట్‌డ్యూటీ ఒక కాలేజీ కుర్రవాడు. మాట వినగానే దగ్గరికి వచ్చి నిలబడ్డాను. సురేంద్రుడు మళ్ళీ—'బడదీదీ!' అన్నాడు.

'రేపు ఉదయం వస్తుంది,' అన్నాడు స్టూడెంటు.

మర్నాడు 'సురేంద్రుడు ఇంకా తెలివిగా ఉన్నాడు. కాని బడదీదీ పేరు ఎత్తలేదు. ఆవేళ పగలంతా జ్వరంతో బాధపడి, సాయంత్రం ఒకర్ని— 'నేను ఆస్పత్రిలో ఉన్నానా ?' అని అడిగాడు.

'ఆc.'

'ఎందుకూ ?'

'బండికింద పడ్డారు.'

'బతుకుతా ననే ఆశ ఉందా ''

'తప్పకుండా.'

మరునాడు మొదటి విద్యార్థి సురేంద్రుని దగ్గరికివచ్చి—'మీకిక్కడెవరన్నా చుట్టా లున్నారా ?' అని అడిగాడు.

'ఎవరూ లేరు.'

'మరి ఆరాత్రి బడదీదీ అని పిలిచారు, ఎవర్ని ? ఆమె ఇక్కడ లేదా ?'

'ఉన్నది, కాని ఆమె రాలేదు. మా తండ్రికి కబురు చేయగలరా ?'

'ఆ.'

సురేంద్రుడు తండ్రిచిరునామా చెప్పాడు. ఆ విద్యార్థి ఆ వేళనే ఉత్తరం వ్రాసివేశాడు. తర్వాత బడదీదీ సంగతి తెలుసుకోవాలని, 'ఇక్కడకు, రా దలచుకొంటే స్త్రీలు కూడా రావచ్చు. మేము ప్రత్యేకపు ఏర్పాట్లు చేస్తాము. మీ అక్కయ్య చిరునామా చెప్పండి, కబురు చేస్తాను,' అని మళ్ళీ అడిగాడు.

కొంచెం సేపు ఆలోచించి సురేంద్రుడు వ్రజబాబు చిరు నామా చెప్పాడు.

'మేము ఉండేది, వ్రజబాబుఇంటికి దగ్గరగానే. ఇవ్వాళ నీస్థితి అంతా వారికి తెలుపుతాను. రా దలచుకొంటే చూడ టానికి రావచ్చు.'

సురేంద్రుడు ఏమీ మాట్లాడలేదు. బడదీదీ రావటం అసంభవం అని మనస్సులో అనుకొన్నాడు. విద్యార్థి దయాపరవశుడై వ్రజబాబుకు ఈ సంగతంతా చెప్పాడు. వ్రజబాబు చకితుడై, 'జీవిస్తాడా?' అని అడిగాడు.

'తప్పకుండా జీవిస్తాడు.'

వ్రజబాబు ఇంట్లోకివెళ్లి కుమార్తెతో- 'మాధవీ! నేను అను కొన్నంతా అయింది! సురేంద్రుడు బండిక్రింద పడి ఆస్పత్రిలో ఉన్నాడు.'

మాధవి శరీరం ఒక్కసారిగా ఝల్లుమన్నది.

'నీపేరు పెట్టి కాబోలు బడదీదీ అని పిలిచాడట. నీవు చూడటానికి పోతావా?'

ఈ సమయంలోనే ప్రక్కగదిలో ప్రమీల ఏదో గట్టిన పడవేసింది. మాధవి అటు పరుగెత్తింది. చాలాసేపటికి తిరిగి

వచ్చి, 'నీవు చూసిరా, నాన్నా. నేను రాలేను!' అన్నది.

వ్రజబాబు ఖేదంతో కూడిన నవ్వు నవ్వి— 'వాడు అడివి జంతువు! వాడి మీదనా నీ కోపం?' అన్నాడు.

మాధవి మాట్లాడలేదు. వ్రజబాబు ఒక్కడే సురేంద్రుని చూడబోయాడు. చూసి చాలా విచారపడి, 'సురేన్, మీతల్లిదండ్రులకు కబురుచేస్తే బాగుండదూ?' అన్నాడు.

'కబురు చేశారు,' అన్నాడు సురేంద్రుడు.

'భయమేమీ లేదు. వారురాగానే నేను ఏదో ఒక బందోబస్తు చేస్తాను!' అని వ్రజబాబు, వారి ఆర్థికపరిస్థితులుఆలోచించి. 'అంతకన్న వారిచిరునామా చెప్పు. వారు రావటానికేమీ ఆటంకాలు లేకుండా చేస్తాను,' అన్నాడు.

సురేంద్రునికి ఈమాట ఏమీ అర్థం కాలేదు. 'నాన్న వస్తాడు. ఇంకా ఆటంకా లేమున్నై?' అన్నాడు.

వ్రజబాబు ఇంటికి వచ్చి ఈసంగతంతా మాధవికి చెప్పాడు. అప్పటినుంచి సురేంద్రుని చూడటానికి రోజుకు ఒక మాటయినా పోతూ ఉండేవాడు. అతనిమీద వ్రజబాబుకు ప్రేమకూడా జనించింది. ఒకరోజున ఆస్పత్రినుంచి తిరిగివచ్చి, 'మాధవీ, నువ్వు చెప్పింది నిజమే! సురేంద్రుని తండ్రి ధనవంతుడు.' అని అన్నాడు.

'ఎలా తెలిసింది?' అని మాధవి ఉత్సుకతతో అడిగింది.

'వాళ్ళతండ్రి పెద్ద వకీలు. నిన్నరాత్రి వచ్చాడు.'

మాధవి మౌనం వహించింది.

'సురేంద్రుడు ఇంటినుంచి పారిపోయి వచ్చాడు!'

'ఎందుకు?' అన్నది మాధవి.

'వాళ్ళ తండ్రితో ఇవ్వాళ మాట్లాడాను. ఆయనే ఇదంతా చెప్పాడు. సురేంద్రుడు ఈయేడే అలహాబాదు విశ్వవిద్యాలయం లో కెల్లా ఫస్టున యం. ఏ. ప్యాసయాడట. విదేశాలకు పోవాలంటే కుర్రవాడు అన్యమనస్కుడని పంప లేదట. అందుకని అలిగి పారిపోయి వచ్చాడు. పంపకపోవ టంకూడా మంచిదే అయింది! ఇంటికి తీసుకు పోతాడట.'

నిశ్వాసం బిగపట్టి, పొర్లుకొచ్చే కన్నీటిని ఆపుకొని, 'అదే మంచిది!' అన్నది మాధవి.

౬

సురేంద్రుడు వెళ్ళిపోయి ఆరుమాసాలు అయింది. ఈ మధ్య ఒకమాటు మాత్రమే మాధవి మనోరమకు ఉత్తరం వ్రాసింది. మళ్ళీ వ్రాయలేదు.

దసరా పండుగకు మనోరమ తండ్రిగారింటికి వచ్చినపుడు మాధవి దగ్గరకువచ్చి 'ఏదీ, నీకోతిని చూపించు' అని పట్టు పట్టి కూర్చున్నది.

మాధవి నవ్వి 'కోతి ఎక్కడ దొరుకుతుందే?' అన్నది.

'నువ్వు పెంచితివిగా!'

'ఎప్పుడూ?'

మనోరమ నవ్వునుఆపుకొని 'అప్పుడే మరచిపోయావా? అతడు నిన్ను తప్ప ఇంకెవ్వరినీ ఎరగడుకదూ?' అన్నది.

మాధవి ఇది చాలాసేపటికిగాని గ్రహించలేదు. గ్రహిం చిన విధంగానే ఆమెముఖంకూడా క్రమంగా వివర్ణమయింది. కాని ఏమీ తోణకకుండా—'ఓ, అతని సంగతా? అతనం

తట అతనే వెళ్ళిపోయాడుగా!' అన్నది.

'ఇలాంటి చక్కని పాదాలు ఎలా వదిలి పోయాడే!'

మాధవి ముఖం ప్రక్కకు తిప్పుకున్నది; మాట్లాడ లేదు. మనోరమ ఆదరంతో ఆమెముఖం ఈవలికి తిప్పి సరసం ఆడబోయింది. మాధవి కళ్ళ వెంట నీరుకారుతూ ఉన్నది—'ఇదేమిటి, మాధవీ!' అని ఆశ్చర్యంతో అన్నది.

మాధవి ఇక సంబాళించుకో లేకపోయింది. కళ్ళమీద చెరుగు పెట్టుకుని ఏడ్చింది.

మనోరమ విస్మయానికి హద్దులేదు. ఏమి అనాలోకూడా ఆమెకు తోచలేదు. కొంతసేపు అలానే ఏడవ నిచ్చింది. తర్వాత ముఖంమీదనుంచి బలవంతాన ముసుగుతీసి—'మామూలు సరసంకూడా సహించలేవా, చెల్లీ!' అన్నది చాలా విచారంతో. 'నేను విధవను, దీదీ!' అంది మాధవి కళ్లు తుడుచుకొంటూ.

తర్వాత ఇద్దరూ కాసేపు నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఇద్దరూ నీరవంగా ఏడుస్తున్నారు. మాధవి దుఃఖం చూచి మనోరమ ఏడుస్తున్నది; పాపం ఆమె విధవ అని! కాని మాధవి ఏడ్చేకారణం వేరు—తనను అర్థంచేసుకోకుండా—'అతడు నిన్నుతప్ప ఇంకెవ్వరినీ ఎరగడుకదూ?' అని సరస మాడిందని. ఈమాట సత్యమని ఆమెకూ తెలును!

'కాని చేసినపని మంచిది కాదు!' అన్నది మనోరమ చాలాసేపు ఉన్నాక.

'ఏపని?'

'అదికూడా చెప్పాలా, చెల్లీ, నేనంతా గ్రహించాను!'

ఈ ఆరుమాసాలనుంచీ ఏవిషయాన్నయితే మాధవి ప్రాణప్రదంగా దాచుకు వస్తున్నదో, దాన్ని మనోరమ దగ్గర దాచ లేకపోయింది. పట్టుపడి, ముఖం చెరగుతో కప్పుకొని పసిపిల్లవలె ఏడువ నారంభించింది.

'కాని వెళ్లిందెందుకు?' అన్నది చివరకు మనోరమ.

'నేనే వెళ్ళిపొమ్మన్నాను.'

'మంచిపని చేశావు—బుద్ధిమంతురాలివి!'

మనోరమ ఏమీ గ్రహించలేదని మాధవి తెలుసుకున్నది. అందుకని సంగతులన్నీ ఒక్కటొక్కటిగా చెప్పి 'కాని అతను బ్రతక్కపోతే నాకు పిచ్చి ఎక్కే దనుకుంటాను!' అన్నది.

'ఇప్పుడు అంతకంటే ఏమి తరుగు!' అని మనోరమ మనస్సులో అనుకొన్నది. ఆరోజున మనోరమ చాలా విచారంతో ఇంటికి తిరిగి వచ్చింది! ఆరాత్రే కలం కాయితం తీసుకుని భర్తకు జాబు వ్రాసింది.

'స్త్రీలను విశ్వసించకూడదని మీరు చెప్పిన మాటలు యదార్థము. ఇవ్వాళ నేను కూడా అదే చెప్పుతున్నాను; ఎందుకంటే మాధవి నాకు నేర్పింది. నేను ఆమెను బాల్యం నుంచీ ఎరుగుదును. ఆమెమీద తప్పు వేయాలనే కోరిక నాకు సుతరామూ లేదు. ఈతప్పంతా స్త్రీజాతిమీద వేస్తున్నాను—విధాతమీద వేస్తున్నాను! అతగాడు, ఇంతకోమలమైన, జలమువంటి ద్రవపదార్థముతో నారీ హృదయాన్ని ఎందుకు సృష్టించాడు? ఇంత ప్రేమను చేర్చి ఈహృదయాన్ని ఎందుకు పోతపోశాడు? ఈ హృదయాల్ని ఇంకా కొంచెం కఠినంగా నిర్మించమని అతగాణ్ణి ప్రార్థిస్తున్నాను.

ఇక మిమ్మల్ని ప్రార్థించేది ఏమంటే—మీపాదాలమీద తల పెట్టి మీ ముఖంవంక చూస్తూ చనిపోనిమ్మని! మాధవిని చూస్తే నాకు భయంవేస్తున్నది. ఆమె నా ఆబాల్య విశ్వాసాలన్నిటినీ తారుమారు చేసింది. నన్నుకూడా మీరు ఎక్కువగా విశ్వసించ వద్దు—త్వరగా వచ్చి తీసుకుపొండి—'

ఆమెభర్త ఇలా జవాబు వ్రాశాడు :

'రూపమున్నవారు చూపెడతారు; గుణాలున్నవారు వెల్లడిస్తారు; హృదయంలో ప్రేమఉన్నవారే ప్రేమించటం ఎరుగుదురు—ప్రేమిస్తారు కూడా! మాధవీలత రసాలవృక్షాన్ని ఆశ్రయించటం ప్రపంచధర్మం—దానికి నీవూ నేనూ ఏమి చేయగలం? నేను నిన్ను బాగా విశ్వసిస్తున్నాను. అందుకోసం నీవేమీ చింతపడ వద్దు.'

మనోరమ భర్త ఉత్తరం హృదయానికి హత్తుకొని, మనస్సులో వారి పాదాలనుద్దేశించి నమస్కరించింది. తర్వాత మళ్లీ ఉత్తరం వ్రాసింది; 'మాధవి మందభాగిని. విధవలు చేయకూడని పని చేసింది!'

ఉత్తరం చదువుకొని మనోరమ భర్త లోలోన నవ్వుకొని కౌతుకంగా జవాబు వ్రాశాడు :

'మాధవి మందభాగినే, అందుకు సందేహంలేదు. కారణం, విధవ అయి కూడా మనస్సులో ఇంకొకర్ని ప్రేమించింది. మీసధవల హక్కుల్లో జోక్యం కలిగించుకొంటున్నది—నీవు కోపించవలసిన విషయమే! నేను బ్రతికిఉన్నంత కాలం నీకే చింతా లేదు. నీకున్న సదుపాయాలేమీ వదులుకోవద్దు; ఈసమయంలోనే తిరిగ్గా ఇంకొకరిని ప్రేమించు.

కాని మనోరమా ! నీవు నాకేమీ ఆశ్చర్యం కలిగించ లేదంటే నమ్ము. ఒకచోట నేనొక లతను చూశాను. అది ఒకమైలు దూరం భూమిమీద పాకి చివరకొక చెట్టును ఆధారం చేసుకొని పైకి ఎక్కింది. ఇప్పుడు దానిని ఎన్నో ఆకులు, ఎన్నో పువ్వులు! నువు ఇక్కడకు రాగానే మన మిద్దరం పోయి ఒకమాటు చూచి వద్దాము.'

మనోరమ కోపంతో దీనికి జవాబివ్వలేదు.

మాధవి ముఖం కొంచెం వాడి పోయింది. ఎల్లప్పుడూ సంతోషంగా ఉండేముఖం కొంచెం గంభీరమయింది. పని పాటల్లో ఒక క్రమపద్ధతిలేదు. అశ్రద్ధహెచ్చింది. ఆమె పూర్వంవలెనే అందరిమీదా ఆత్మీయత చూపిస్తున్నది. నిజం చెప్పవలిసివస్తే ఇంకా కొంచెం పెంచిందికూడా. కాని ప్రతివిషయమూ పూర్వంమాదిరిగా జ్ఞాపకం ఉండటంలేదు! మధ్యమధ్య మరపుకూడా ఉండేది.

ఇప్పుడుకూడా ఆమెను అందరూ 'బడదీదీ' అనే అంటు న్నారు. ఇప్పుడుకూడా అందరూ ఆ కల్పతరువువంకే చూస్తు న్నారు. చేయిచాస్తున్నారు—అభీష్టఫలం పొందుతున్నారు. కాని ఆచెట్టు వెనకటిమాదిరి తేజోవంతంగా లేదు. కాస్తె ప్రపంచానుభవంకల వృద్ధులు ఆచెట్టు ఎండి పోతుం దేమో నని కూడా అప్పు డప్పుడూ సందేహించేవారు.

మనోరమ రోజూ వస్తూనే ఉన్నది. ఇతరవిషయాలు అనేకం మాట్లాడేగారు; కాని ఈవిషయం తలపెట్టేవారే కాదు. ఈవిషయం ఎత్తితే మాధవికి కష్టంగా ఉంటుందని మనోరమకు తెలుసును. అందుచేత ఈవిషయాన్ని కది

లించకుండా ఉండటమే మంచిదని ఆమె భావించేది. మంద భాగిని ఈవిషయం ఎంత త్వరగా మరిచిపోతే ఆమెకు అంత శ్రేయస్కరమని మనోరమ తలచేది!

• • •

సురేంద్రుడు ఆరోగ్యవంతుడై తండ్రివెంట ఇంటికి వెళ్లాడు. ఇప్పుడు మారుతల్లి అతనిమీద వెనకటి మాదిరిగా శ్రద్ధ తీసుకోవటం లేదు. అందుచేత సురేంద్రుని శరీరం కూడా కొంచెం స్వస్థత చెందింది. కాని పూర్తిగా నయం కాలేదు; ఇంకా గుండెల్లో నొప్పి వున్నది. రూపయౌవన పిపాసలింకా అతని మనసులో అంకురించలేదు. వాటిని గురించి అతను ఆలోచించేవాడే కాదు. పూర్వం మాదిరి ఇప్పుడుకూడా అన్యమనస్కుడు; పరావలంబనుడు. కాని తాను ఆధారపడవలసిన వ్యక్తిని ఇంకా అతను వెతుక్కో లేదు; వెతికినంతలో దొరకనూలేదు. దొరకలేదని అతను తన పనులు తాను చూచుకుంటున్నాడా, అంటే అదీలేదు. ఇప్పుడుకూడా ఇతర్ల వంకనే చూస్తూఉంటాడు. కాని వెనకటికీ ఇప్పటికీ తేడా ఏమంటే, ఇప్పుడు ప్రతిపనిలోనూ అతను లోపాలు కనిపెడుతూ ఉన్నాడు; గొణుక్కుంటూ ఉన్నాడు. ఇది చూసి—'సురో ఇప్పుడు చాలా మారి పోయా'డని మారుతల్లి అంటూ ఉండేది.

ఈమధ్య ఒకనాడతనికి జ్వరం వచ్చింది. చాలా బాధ పడ్డాడు. కళ్లవెంట నీరుకూడా కార్చాడు. మారుతల్లి పక్కనే కూర్చుని ఉన్నది. ఇంతకాలానికి ఆమె సురేంద్రునిలో మార్పు చూసింది. ఆమె కళ్ళల్లోకూడా నీరు తిరి

గింది. చాలా ఆదరంతో సురేంద్రునికళ్ళు తుడిచి—'సురో, ఎందుకు నాయనా?' అన్నది.

సురేంద్రుడు మాట్లాడలేదు. ఒక పోస్టుకార్డు తీసుకుని వంకరటింకర అక్షరాలతో 'బడదీదీ, నాకు జ్వరంవచ్చింది; చాలా బాధగా ఉంది.' అని రాశాడు. కాని కార్డు తపాలా పెట్టెలో పడలేదు. ముందు పక్కమీదనుంచి టేబిలు మీదకు పోయింది. తర్వాత ఇల్లు ఊడ్చేవాడు ఆల్‌బకరా విత్తులూ, బిస్కత్తుముక్కలూ, ద్రాక్ష తొక్కలతోపాటు ఈ ఉత్తరాన్నికూడా కలిపి తుక్కుపోగులో పారవేశాడు. సురేంద్రుని ప్రాణప్రదమైన కోరిక, ఎండకు ఎండి, మంచుకు తడిసి, దుమ్ముకొట్టుకుని, గాలికి ఎగిరి ఒక రావిచెట్టు క్రింద పోయి పడింది.

కొన్నాళ్ళు సురేంద్రుడు జవాబు వస్తుందనే ఆశతో ఎదురు చూశాడు. కాని ఎన్నాళ్ళు గడిచినా జవాబురాలేదు. నెమ్మదిగా అతని జ్వరం తగ్గింది, లేచి తిరుగుతున్నాడు. తర్వాత కొంతకాలానికి అతని జీవితంలో ఒక కొత్త ఘటన ఘటిల్లింది. నూతనమైనా స్వాభావికమైనదే. సురేంద్రుని తండ్రికి ఇది మొదటినుంచీ తెలుసును. ఇలా జరుగుతుందని ఆయన ఆశించే ఉన్నాడు.

సురేంద్రుని మాతామహుడు పాబనాజిల్లాలో ఒక మధ్య రకం జమీందారు. ఇరవై, ఇరవైయైదు గ్రామాలున్నవి. సంవత్సరానికి యాభై వేల రూపాయలదాకా ఆదాయం వస్తుంది. అతనికి కొడుకులులేరు; ఖర్చుకూడా తక్కువ; పైగా అతను కృపణుడని ప్రసిద్ధి. అందుచేతనే తన దీర్ఘ

జీవితంలో చాలా డబ్బు నిలవచేసి పోయాడు. అతని ఆస్తికి సాహిత్రుడగు సురేంద్రుడే వారసుడవుతాడని సురేంద్రుని తండ్రికి తెలుసును. జరిగిందికూడా అంతే. మామగారు మరణశయ్య మీద ఉన్నారని కబురువచ్చింది. తక్షణం సురేంద్రునితండ్రి కొడుకును వెంటబెట్టుకొని పాబనా బయలు దేరాడు. కాని అక్కడికి చేరకముందే మామగారు ఈలోకం వదలి పెట్టారు.

శ్రాద్ధం మహా గొప్పగా చేశారు. అసలు చనిపోయిన జమీందారే కరనుడు; పైన ఈ వకీలుగారి బందోబస్తుకు ప్రజలు హడలెత్తి పోయారు! ఇక సురేంద్రునికి వివాహం చేయటం అవసరం. సంబంధాలు కుదిర్చేవారి రాకపోకలతో ఊరంతా అలజడిగా ఉంది. యాభైకోసులమధ్య ఎక్కడ కాస్త మంచిపిల్ల ఉన్నదన్నా ఈ దండు వారింటిమీదికిపోయి పడేది—రకరకాల ఆశలూ నూపెట్టేది. ఈవిధంగా నాలు గైదు మాసాలు గడిచాయి. చివరకు మూరుతల్లి వచ్చింది. చుట్టపక్కా లందరూ వచ్చారు—బంధుమిత్రులతో ఇల్లు కిటకిటలాడుతున్నది.

తర్వాత ఒకనాటి ఉదయం, సన్నాయీ, నౌబత్ ఖానా, రండోళ్లూ, ఢాకాలతో మామగారి గ్రామమంతా దద్దరిల్ల చేసి, సురేంద్రుడు వివాహం చేసుకొని స్వగ్రామం తిరిగి వచ్చాడు.

౨

దాదాపు అయిదారు సంవత్సరాలు గడిచాయి. సురేంద్రుని తండ్రి ఈ లోకంలో లేడు. వ్రజబాబుకూడా చనిపోయాడు.

సురేంద్రునిమారుతల్లి భర్త ఇచ్చిన సంపత్తి తీసుకుని కన్నవారింట ఉంటూఉన్నది.

సురేంద్రునికి ఇప్పుడు ప్రఖ్యాతి ఎంతో అపఖ్యాతి అంత. ఇటువంటి మిత్రవత్సలుడూ, అమాయకుడూ, స్నేహితులను పోషించే జమీందారూ ఇంకొకడు లేడని ఒక ముఠావారు చెప్పుతున్నారు. రెండో ముఠావారు ఇటువంటి అత్యాచారీ, ప్రజలను పీడించే జమీందారూ, ఈ ప్రాంతాల్లో ఎప్పుడూ పుట్టలేదని అంటున్నారు. నాకు తెలిసినంతవరకు ఇవి రెండూ సత్యం. మొదటిది సురేంద్రునిపట్లా; రెండోది అతని మేనేజరు మధురబాబు పట్లా.

సురేంద్రుని బైఠక్‌ఖానాలో చాలామంది మిత్రులు కూడుతూఉంటారు. మహా ఆనందంతో ఇహలోకవాంఛితా లన్నీ తీర్చుకుంటూ ఉంటారు. తాంబూలమూ, తంబాకూ, మద్యమాంసాలకోసం వాళ్ళు వెతకవలసిన అవుసరం అలా ఉంచండి—అడగవలసినపని కూడా లేదు. వాటి అంతట అవే వచ్చేవి.

మేనేజరు మధురబాబుకు ఇవంటే చాలా ఇష్టం. ఖర్చు పెట్టడంలో మహాభారీ చెయ్యి. కాని వీటికోసం జమీందారును నష్టపెట్టేవాడు కాదు. శాసించడం ఎట్లాగో వీరికి తెలుసు; కాబట్టి ప్రజలే ఈ ఖర్చులు భరిస్తూ ఉండేవారు. మధురబాబు ఒక్కపైసాకూడా పన్నుబకాయి ఉండనిచ్చే వాడు కాదు. అవసరమైతే ఇల్లు తగలవేయించో, పొలము అమ్మించో, కచ్చేరీగదిలో పెట్టి తాళం వేసో వసూలు చేసే వాడు. ఇలాంటిపనులంటే అతనికి మహా సరదా!

ప్రజల హాహాకారాలు అప్పుడప్పుడూ శాంతిదేవిచెవుల బడుతూ ఉండేవి. ఆమె భర్తను—"మీరు స్వయంగా జమీందారీవ్యవహారాలు చూడకపోతే ప్రజలు నాశనమై పోతా"రని హెచ్చరిస్తూ ఉండేది.

సురేంద్రుడు నిద్రనుంచి మేలుకొన్నవానివలె—" అదే, అదే! ఇదంతా నిజమేనా?" అనేవాడు.

'నిజంకాదు! దేశమంతా మిమ్మల్ని తిడుతున్నారు. మీచెవులదాకా మాత్రం రావటంలేదు. ఇరవైనాలుగు గంటలూ స్నేహితులతో కూచుంటే ఇవి మీకెలా వినపడు తై? ఇలాంటి మేనేజరు మన కవసరంలేదు—వెళ్ళగొట్టండి!'

సురేంద్రుడు అప్రతిభుడై—"అదే—రేపటినుండి వ్యవహారాలన్నీ నేనే చూస్తాను." అనేవాడు విచారపడుతూ.

తర్వాత కొన్నాళ్ళపాటు జమీందారీ వ్యవహారాలన్నీ శ్రద్ధగా చూసేవాడు. మథురబాబు చాలా వ్యాకులపడే వాడు. మరీ సహించలేనప్పుడు 'సురేన్‌బాబూ! ఇలాచేసి జమీందారీ నిలుపుకో గలరా?' అనేవాడు గంభీరంగా.

సురేంద్రుడు మందహాసం చేసి 'బీదల రక్తం పీల్చే జమీందారీ ఉంటే ఏం, లేక పోతే ఏం, మథురబాబూ?" అనేవాడు.

'అయితే నాకు సెలవివ్వండి. నేను వెళ్ళిపోతాను!'

సురేంద్రుడు మెత్తబడి పోయేవాడు. తర్వాత మళ్ళ మామూలే. బైఠక్‌ఖానానుంచి బయటికి వచ్చేవాడుకాడు. ప్రస్తుతం ఇంకో ఉపసర్గ వచ్చి కలిసింది. ఉద్యానవాటికలో క్రొత్తగా భవనం ఒకటి కట్టించాడు. ఏలోకేశి అనే వేశ్య

కలకత్తానుంచి వచ్చి దాంట్లో దిగింది. ఆటపాటల్లో మంచి ప్రవీణ. చూపులకుకూడా ఫరవాలేదు. దులిపిన తేనెతుట్టె నుంచి తేనెటీగలన్నీ ఒక్కమాటు ఎగిరిపోయి ఎక్కడైనా వాలినట్లు సురేంద్రుని మిత్రులందరూ బైఠక్‌ఖానా వదలి పెట్టి వాటికాభవనంలో పోయి వాలారు. వాళ్ల ఆనందానికి హద్దు లేదు. ఉత్సాహానికి పరిమితిలేదు. సురేంద్రునికూడా అక్కడకు లాక్కుపోయారు. నేటికి మూడురోజు లైంది—శాంతికి భర్త కనపడి. నాలుగోనాటి పగలు భర్తనుచూసి, తలుపుకు వీపు ఆనించి కూర్చుని—'ఇన్నాళ్ళనుంచీ ఎక్కడున్నారు?' అని శాంతి భర్తను అడిగింది.

'వాటికా గృహంలో,'

'అక్కడ ఎవరున్నారు—ఈమూడురోజులనుంచీ ఇటు తొంగి చూడక పోవటానికి?'

'అదే—'

'అన్నిటికి అదే! నేనంతా విన్నాను.' అంటూ శాంతి ఏడ్చింది. 'నేను ఏమి తప్పు చేశానని, నన్ను మీ రిలా కాళ్ళతో నెట్టివేస్తున్నారు?'

'ఎక్కడ? అలా నేను—'

'కాళ్ళతో నెట్టివేయడమంటే ఇంకా ఏమిటి? ఇంత కన్నా అవమానం మాకు వేరే ఏ ముంటుంది?'

'అదే—అదే. వాళ్ళందరూ—'

శాంతి ఇక ఆమాట వినలేకపోయింది. ఏడుస్తూ—'మీరు నాభర్తలు. నాకు ఇహమూ—పరమూకూడా మీరే. నేనింకా మిమ్మల్ని తెలుసుకోలే దనుకుంటున్నారా?

నాకు తెలుసును—నేను మీకేమీ కానని! ఒక్కనాడైనా మీ మనస్సును వశ్యం చేసుకోలేక పోయాను. నా కష్టాలు మీకెప్పుడూ చెప్పలేదు—సిగ్గుపడతారేమో నని, దుఃఖ పడతారేమో నని!' అన్నది.

'శాంతీ! ఎందుకు ఏడుస్తావు?'

'ఎందుకా ఏడ్చేది? ఆ అంతర్యామికి తెలుసు. మీరు నన్ను ఆదరించ లేరు. మీమనస్సులో కూడా దుఃఖం ఉంది. నాకర్మానికి మీరు మాత్రం ఏమి చేస్తారు?' తర్వాత కళ్లు తుడుచుకొని అన్నది—'నేను పుట్టినప్పటినుంచీ కష్టాలు అనుభవిస్తున్నాను; అనుభవించినా నష్ట మేమీ లేదు. కాని మీకష్ట మేదో తెలుసుకోగలిగితే—'

సురేంద్రుడు ఆమెను దగ్గరకు లాక్కుని చేతులతో కళ్లు తుడుస్తూ—'తెలుసుకుని ఏమిచేస్తావు శాంతీ?' అన్నాడు ప్రేమతో.

ఈప్రశ్నకు ఇంకా జవాబున్నదా? శాంతి వెక్కి వెక్కి ఏడ్చింది. చాలాసేపు ఉన్నాక శాంతి 'మీ ఆరోగ్యం యిప్పుడు బాగోలేదు,' అన్నది.

'ఇప్పుడేం? అయిదు సంవత్సరాలనుంచీ లేదు. కల కత్తాలో ఉండగా బండికింద పడ్డాను. గుండెకు పెద్ద దెబ్బ తగిలింది. ఒకమాసం రోజులు మంచంమీద ఉన్నాను. అప్పటి నుంచీ ఇప్పటి వరకూ నొప్పి కనబడుతూనే ఉంది. ఇన్నాళ్లు ఎట్లా బ్రతికానా అని అప్పుడప్పుడూ నేనే ఆశ్చర్య పడుతూ ఉంటాను.'

శాంతి ఆదుర్దాతో భర్త రొమ్ముమీద చేయిపెట్టి—

'పదండి, ఈ దేశం వదలి కలకత్తా పోదాం. అక్కడ పెద్ద పెద్ద డాక్టర్లు—' అన్నది.

సురేంద్రుడు ఒక్కమాటుగా ఆనందితుడై— 'అలాగే పద. అక్కడ బడదీదీ కూడా ఉంది,' అన్నాడు.

'మీ బడదీదీని చూడాలని నాకు కూడా కోరిగ్గా ఉంది. ఆమెను పిలిపిస్తారా!'

'పిలిపిస్తాను!' అని తర్వాత కాసేపు ఆలోచించి 'తప్పకుండా వస్తుంది. నేను చనిపోతున్నానని వింటే-' అన్నాడు.

శాంతి భర్తనోరు కప్పిపెడుతూ—'మీ కాళ్ళమీద పడతాను. ఇక అలా అనకండి!' అన్నది.

'అహా! ఆమె వస్తే నాకిక ఏ బాధా ఉండదు.'

శాంతి ఆత్మాభిమానానికి కొంచెం దెబ్బ తగిలింది. ఇంతకుముందే భర్తకు తానేమీ కానని చెప్పిఉంది. కాని సురేంద్రుడు అంతదాకా ఆలోచించలేదు; అంత దూరం పరికించనూ లేదు: తను చెప్పినదానికే మహా సంతోష పడుతున్నాడు—'నువ్వు స్వయంగా పోయి బడదీదీని పిల్చుకురా, ఏమంటావు?' అని అడిగాడు.

కట్ట తెగిన నదీప్రవాహం లాగా శాంతికళ్ళనుంచి అశ్రువులు ప్రవహింప నారంభించినవి.

మర్నాడు శాంతి దాసిచేత మధురబాబుకు—'ఉద్యాన వాటికలోకి తీసుకొనివచ్చిన మనిషిని వెంటనే వెళ్ళగొట్టక పోతే మేనేజరుపనిలోంచి మానుకోవలసివస్తుం' దని కబురు పంపించింది. తర్వాత—'ఏమైనా కానియ్యండి, మీరు బయటికి పోయినట్లయితే నేను తల పగులగొట్టుకు చస్తా,'

నని భర్తను బెదరించింది.

'అదే—కాని వాళ్ళు—'

"'కాని' సంగతి నేను చూస్తాను," అని శాంతి మళ్ళీ దాసిని పిలిచి—'ఆదార్భాగ్యుల్ని ఇంట్లో అడుగు పెట్టనివ్వ వద్దని దర్వానుతో చెప్పు,' అని చెప్పింది.

వ్యవహారం పెడ తిరిగిం దని గ్రహించి, మధురబాబు ఏలోకేశికి సెలవుచీటీ ఇచ్చాడు. మిత్రులిక లాభం లేదని వెళ్ళిపోయారు. మళ్ళీ నెమ్మదిగా సురేంద్రుడు జమీందారీ పనులు చూడ నారంభించాడు,

సురేంద్రుని కలకత్తా ప్రయాణం ప్రస్తుతం ఆగిపోయింది. గుండెనొప్పికూడా చాలావరకు తగ్గినట్టుగానే కనపడింది. కలకత్తా పోవటానికి శాంతి అంత ఉత్సాహం కనపర్చలేదు. భర్తకు ఇక్కడే, తాను చేయగలిగినంత సేవ చేయ నారంభించింది. కలకత్తానుంచి డాక్టర్ని ఒకాయన్ని పిలిపించి చూపించింది. డాక్టరు సంగతంతా విని, పరీక్ష చేసి, ఔషధం వ్రాసి ఇచ్చాడు హృదయ పరిస్థితిని బట్టి శారీరకంగానూ, మానసికంగానూ ఏమాత్రం పరిశ్రమ చేయకూడదని హెచ్చరించాడు.

ఇప్పుడు డాక్టరుసలహానుసరించి సురేన్ జమీందారీ వ్యవహారాలు చూడటంలేదు. మేనేజరు మళ్ళా మామూలుగానే అత్యాచారాలు చేయ నారంభించాడు. ప్రజల్లో హాహాకారాలు చెలరేగినై. అవి అప్పుడప్పుడూ శాంతి చెవిదాకా వచ్చేవి! కాని భర్తకు చెప్ప సాహసించేదికాదు.

౮

క్రలకత్తా భవనంలో వజ్రబాబుగారి స్థానంలో ఇపుడు శివచంద్రుడు యజమాని. మాధవికి బదులు శివచంద్రుని భార్య ఇపుడు యజమానురాలు. మాధవి ఇంకా ఇక్కడనే ఉన్నది. శివచంద్రుడు ఈమెను చాలా ఆదరంగానే చూస్తున్నాడు. కాని మాధవికి ఇక్కడ ఉంటానికి మనస్సు కొలపటంలేదు. ఇంట దాసదాసీలూ, మేనేజరూ, గుమస్తా వగైరాలు ఇప్పుడు కూడా ఈమెను బడదీదీ అనే పిలుస్తున్నారు. కాని, పెత్తనాల్ళపుచెవి మరోవ్యక్తి చేతికి పోయిందని వారందరికీ తెలుసు. అలాగని శివచంద్రుని భార్య మాధవిని అమర్యాద కానీ అవజ్ఞ కానీ చేస్తూవున్నదనటానికి వీలులేదు. కాని ఆమె చూపించే భావాన్ని బట్టి ఆమె అనుమతీ పరామర్శా లేకుండా అన్ని పనులూ తాను స్వతంత్రించి చేయకూడదని మాధవి బాగా గ్రహించింది.

అప్పుడు తండ్రిగారి పెత్తనం; ఇప్పుడు అన్నగారి అమలు. అందువల్లనే కొంత మార్పు కూడా వచ్చింది. పూర్వం ఆదరమూ వున్నది, అధికారమూ వుంది—ఇపుడు అదరం వున్నది కాని అధికారం తగ్గినది. అపుడు తండ్రిగాని ఆదరమంతా ఈమె ఒక్కతెమీదనే—ఇపుడు ఆత్మీయుల్లో ఈమె కూడా ఒక్కతె అయింది.

ఎవరైనా, నేను శివచంద్రునిగానీ అతని భార్యనుగానీ దోషిని చేస్తున్నాననీ—స్పష్టంగా అనకుండా అటూ యిటూ మెలికలు తిప్పి నిందిస్తున్నాననీ తలస్తే—వారు నన్ను సరిగ్గా అర్థం చేసుకో లేదన్నమాట. ప్రపంచ రీతి- నీతులు నేటి

వరకూ ఎలా వస్తున్నవో అది మాత్రం నేను యిక్కడ వ్రాశాను. మాధవిగీత మంచిది కాదు; మందభాగిని; ఆమెకు నా అనేవారు లేరు. అందుకని ఇతరులు తమ హక్కులు ఎందుకు వదులుకుంటారు? భర్తఆస్తిమీద భార్యకు అధికార మున్నదని ఎవరు ఎరగరు? శివచంద్రుని భార్య ఇంతమాత్రం తెలుసుకోలేదా? శివచంద్రుడు మాధవికి సోదరుడు. కాని అతనిభార్యకు మాధవి ఎవరు? మాధవికి అంతా తెలుసు. ఆమె వదిన చిన్నదిగా ఉన్నప్పుడు వ్రజబాబు ఇంకా బ్రతికే వున్నాడు. అప్పుడు ప్రమీలకూ ఆమెకూ అట్టే తేడా చూపించేది కాదు మాధవి. ఇప్పుడు అభిప్రాయాలు కలవటం లేదు. మాధవి మొదటినుంచీ అభిమానిని—అందుకనే అందరికీ తగ్గివుండేది. మాటపడే ఓర్పు లేదు—అందుకనే మాట్లాడేది కాదు. బలం లేనిచోట తల యెత్తుకు నిలబడటమంటే ఆమెకు తల కొట్టివేసినట్లు వుండేది. మనస్సుకు కష్టంకలిగినా మాట్లాడకుండా సహించేది. అన్నకు ఏమీ చెప్పేది కాదు. పితూరీలు చెప్పే అభ్యాసం ఆమె కెప్పుడూ లేదు. ఆత్మీయతను అడ్డుపెట్టుకొని అధికారం సంరక్షించుకోవడమంటే ఆమెమనస్సు ధిక్కారం చేసేది. సామాన్యస్త్రీలమాదిరి కలహించటమంటే ఆమెకు ఎక్కడా లేని ఏవగింపు.

'నేను మాయింటికి వెళ్తాను, అన్నాయ్,' అని ఒక రోజున మాధవి అన్నను అడిగింది.

శివచంద్రుడు విస్మయంతో 'అదేమిటి, మాధవీ! అక్కడ యెవరూ లేరుగా!' అన్నాడు.

మాధవి చనిపోయినభర్త నుద్దేశించి, 'వారిమేనల్లుడూ

చెల్లెలూ కాశీలో వుంటున్నారు. వారిని తీసుకు వచ్చి గోవిందపురంలోనే వుంటాను,' అన్నది.

గోవిందపురం పాబనా జిల్లాలోని ఒక కుగ్రామం. మాధవి అత్తగారి ఇల్లు అక్కడనే వున్నది. శివచంద్రుడు నవ్వుతూ, 'అదెలా! అక్కడ వుంటే నీకు చాలా యిబ్బంది కాదూ?' అని అడిగాడు.

'ఇబ్బంది యేముంది? ఇల్లింకా పడిపోలేదు. పది పన్నెండు యెకరాల పొలంకూడా వున్నది. వాటితో ఒక విధవకు జరగదా?'

'జరగనీ కాదు, డబ్బు లేదనీ కాదు' ఎలాగయినా నీవు చాలా ఇబ్బంది పడతావు మాధవీ!'

'ఇబ్బంది యే ముంటుందిలే, అన్నాయి!'

శివచంద్రుడు కాస్త ఆలోచించి—'ఎందుకు పోతున్నావు, చెల్లీ! నాకు దాచకుండా చెప్పు. నేనంతా సరి చేస్తాను,' అన్నాడు.

ఇంతకు ముందు శివచంద్రుడు భార్యదగ్గర చెల్లెలిమీద యేవయినా పితూరీలు విని వుండవచ్చు. బహుశ అవి జ్ఞాపకం వచ్చే పై మాట అని వుంటాడు. కాని మాధవి ముఖం సిగ్గుచే కందగడ్డ లాగయింది...'దాదా, నేను పోట్లాడే నీఇంట్లోంచి వెళ్ళి పోతున్నానని భావిస్తున్నావా?' అంది.

శివచంద్రుడుకూడా సిగ్గుపడ్డాడు—'కాదు, అది కాదు! నేను ఆమాట అనలేదు. ఈయిల్లు పూర్వంనుంచీ నీదే కదా. మరి యివ్వాళ యెందుకు వెళ్ళా లంటున్నావు?' అని తడబడుతూ అన్నాడు.

ఇద్దరికీ ఒక్కసారే తండ్రి జ్ఞాపకం వచ్చాడు. ఇద్దరి కళ్ళలోనూ నీరు కనపడింది—'మళ్ళీ వస్తాను. మీ అబ్బాయికి వడుగు చేసుకొనేటప్పుడు తప్పకుండా తీసుకు వద్దువు కాని—ఇప్పుడు పోనీయి,' అని కళ్ళు తుడుచుకొని మాధవి అన్నది.

'అదింకా ఎనిమిది సంవత్సరాల తర్వాత మాటగా ?'

'బ్రతికి ఉంటే తప్పకుండా వస్తాను!'

ఏవిధంగానూ మాధవి ఇక్కడ ఉంటానికి ఇష్టపడలేదు. వెళ్ళే ప్రయత్నాలు చేయసాగింది. కుటుంబమంతా వదినెకు వప్పచెప్పింది. దాసదాసీలను ఆశీర్వదించింది. వెళ్ళబోతుండగా శివచంద్రుడు అశ్రుపూరిత నేత్రాలతో చెల్లెలి దగ్గరకు వచ్చి...మాధవీ! మీ అన్నాయి యెప్పుడూ నిన్నేమీ అనలేదు కదా ?' అని అడిగాడు.

'అదేమి మాట, దాదా ?' అని మాధవి నవ్వింది.

'నిజమేనా ?'

'నిజం.'

'అయితే పో! నీ యింటికి నీవు పోతుంటే నేను వద్దనను. నీకు యెక్కడ బాగుంటే అక్కడే వుండు, కాని ఎప్పుడూ క్షేమాలు మాత్రం తెలుపుతూ వుండు.'

మాధవి ముందు కాశీ వెళ్ళి ఆడుబిడ్డ కొడుకును వెంటబెట్టుకొని గోవిందపురం వచ్చి నిండు ఏడు సంవత్సరాలు గడిచినాక మళ్ళీ భర్త యింట్లో ప్రవేశించింది.

అపుడు గోవిందపురంలో ఉండే చటర్జీ మహాశయునికి గొప్ప విపత్తు వచ్చింది. వీరూ యోగీంద్రుని తండ్రీ మంచి

స్నేహితులు. అందుకనే యోగీంద్రుని తండ్రి మృత్యు సమయంలో తన ఆస్తినంతా వీరికి వప్పచెప్పి పోయాడు. యోగీంద్రుడు బ్రతికివుండగా కూడా పొలం అంతా ఇతనే చూస్తూవుండేవాడు. యోగీంద్రుడు అంత శ్రద్ధ వహించేవాడు కాడు. కారణం మామగారి దగ్గర బోలెడు డబ్బున్నది. అందుచేతనే పితృదత్తమైన యీస్వల్ప ఆస్తిని అతడు జాగ్రత్తచేయలేదు. చేయవలసిన అవసరంకూడా కనపడలేదు. తర్వాత వీరు చనిపోయినప్పటినుంచీ చటర్జీగారు ఏ ఆటంకాలూ లేకుండా ఈ ఆస్తిని అనుభవిస్తూ తన అధికారంలో ఉంచుకొన్నారు. ఇప్పుడు మాధవి ఇన్నేళ్ల తర్వాత తిరిగి వచ్చి చటర్జీగారి భుక్తానికి భంగం కలిగించింది. చటర్జీగారికిది చాలా అన్యాయంగా తోచింది. మాధవి ద్వేషంతోనే ఇలా చేసిందనికూడా స్పష్టంగా గ్రహించాడు. చాలా కష్టంతో ఆమెయింటికి వచ్చి—'అదే, అమ్మాయి! నీకున్న రెండెకరాలకుగాను పది సంవత్సరాల శిస్తు బకాయి వుంది. వడ్డీ మొదలుతో ఇప్పుడది నంద రూపాయలదాకా అయింది. వేలంవేయటానికి సిద్ధంగా వున్నారు,' అని అన్నాడు.

మాధవి ఆడుబిడ్డ కొడుకు సంతోషకుమారునిచేత 'డబ్బుకోసం ఏమీ దిగులుపడనక్కర్లే' దని చెప్పించి, వెంటనే వందరూపాయల నోటుఒకటి యిచ్చి పంపించింది. ఈ డబ్బు చటర్జీగారికి వేరువిధంగా ఉపయోగపడింది.

మాధవి యింత తేలిగ్గా వదిలేదికాదు. సంతోషునిపంపి—'కేవలం యీ రెండెకరాలమీదనే మా మామగారికి భుక్తి గడుస్తూవుండదు. కాబట్టి ఇంకాభూమి ఉండాల్సి ఉంది.

మిగతా భూమి ఎక్కడ-ఎవరిదగ్గర ఉన్నది?' అని అడిగించింది.

చటర్జీ మహాశయుడు మహా కుపితుడై స్వయంగా విచ్చేసి 'అదంతా అమ్ముడు పోయింది. కొద్దిగావుంటే మక్తాకు ఇచ్చి వుంది. ఏడెనిమిది సంవత్సరాలనుంచీ జమీందారుకు పన్నులు చెల్లించకపోతే భూమి ఎలాఉంటుంది?' అని జవాబిచ్చాడు.

'భూమిలో ఏమీ పండటం లేదా, యీ కొ స్త శిస్తు చెల్లించకపోవటానికి? నిజంగా అమ్ముడుపోయివుంటే దాన్ని మళ్ళీ తీసుకోవటానికి ప్రయత్నిస్తాను. కాయితాలు అవీ యెవరిదగ్గర ఉన్నవి?'

చటర్జీగారు ఏదో జవాబిచ్చారు. మాధవికి అది అర్థం కాలేదు. బ్రాహ్మణుడు మెల్లగా ఏదో గొణుక్కున్నాడు. తర్వాత గొడుగు వేసుకొని తిన్నగా జమీందారుగారి కచేరీ వుండే లలితగ్రామం బయలుదేరాడు. ఈగ్రామంలోనే సురేంద్రుడు ఉండేది. మధురబాబు కచ్చేరీకూడా ఇక్కడే. ఏడెనిమిది కోసులదూరం నడిచి తిన్నగా మధురబాబు దగ్గరకు పోయి—'రక్షించు, బాబూ! బీద బ్రాహ్మణ్ణి. ఇళ్ళవెంట తిరిగి బిచ్చమెత్తుకు తినాలి,' అని పెద్దపెట్టున యేడ్చాడు.

మధురబాబుదగ్గరకు రోజూ ఇలా చాలామంది వస్తూ వుంటారు. 'ఏమి వచ్చింది?' అని అడిగాడు.

'రక్షించాలి, బాబూ—'

'నీకేమొచ్చింది?'

విధుచటర్జీ అపుడు మాధవి యిచ్చిన వందరూపాయలు వారిచేతిలోపెట్టి—'న్యాయమూర్తులు, తమరు రక్షించకపోతే నా సర్వమూ పోతుంది.'

'సరే, వివరంగా చెప్పు.'

'నాది గోవిందపురం, పేరు విధుచటర్జీ. రామతను సన్యాలు విధవ కోడలు ఇన్నాళ్ళతర్వాత ఎక్కడనుంచో వచ్చి నా ఆస్తినంతా దఖలు చేసుకోవాలని చూస్తున్నది.'

మధురబాబు నవ్వుతూ—'ఆమె నీ ఆస్తినంతా దఖలు పరచుకోవాలంటున్నదా లేక నీవే ఆమె ఆస్తినంతా స్వాధీన పరచుకోవాలంటున్నావా?' అని అడిగాడు.

బ్రాహ్మణుడపుడు జందెంముట్టి మధురబాబు రెండు చేతులూ పట్టుకొని 'నేను పది సంవత్సరాలనుంచీ సర్కారు వారి శిస్తు చెల్లిస్తూ వస్తున్నానుబాబూ!' అన్నాడు.

'ఫలసాయం అనుభవిస్తున్నప్పుడు శిస్తు చెల్లించవా?'

'బాబూ, తమరు రక్షించాలి—'

మధురబాబు కీలు కనిపెట్టాడు:—'విధవను మోసపుచ్చాలని చూస్తున్నావా?'

బ్రాహ్మణుడు గుడ్లు వప్పజెప్పి ఊరుకున్నాడు.

'ఎన్నెకరాల భూమి?'

'పాతిక ఎకరా లుంటుంది.'

మధురబాబు ఖరీదు అంచనా వేసి-'కనీసం మూడు వేల రూపాయలు చేస్తుంది. కచేరీకి నజరానా ఎంత చెల్లిస్తావు?' అని అడిగాడు.

'తమరు సెలవిచ్చినంత! మూడువందల రూపాయలు.'

'మూడు వందలిచ్చి మూడు వేల రూపాయల ఆస్తి కాజేస్తావా? నావల్ల యేమీ కాదు.'

బ్రాహ్మణుడు పొడికంట తడిపెట్టుకొని, 'మరి యెంత

సెలవిస్తారు?' అన్నాడు.

'ఒక వెయ్యి ఇస్తావా?'

తర్వాత యిద్దరూ రహస్యంగా చాలాసేపు మాట్లాడుకున్నారు. ఫలితంగా పది సంవత్సరాలశిస్తు బకాయీ—దానికి వడ్డీకలిసి పదిహేను వందల రూపాయలకు, మాధవిమీద దావా పడింది. సమను జారీఅయింది; కాని మాధవిదాకా రాలేదు. ఎక్స్‌పార్టీ డిక్రీ అయింది. మాసమున్నర గడిచినాక శిస్తు బకాయికిగాను జమీందారు దావావేసి ఇల్లు, పొలం జప్తుచేశాడని మాధవి తెలుసుకుంది.

'మీ దేశం మొగలాయిరాజ్యమా ఏం, తల్లీ?'-మాధవి పొరుగావిడను అడిగింది.

'ఎందుకని?'

'ఎందుకనేమిటి? నా ఆస్తినంతా ఒకమనిషి పట్టపగలు దోచివేయడం మీరు చూడటంలేదా?'

'మావల్ల ఏమవుతుంది? జమీందారుగారే వేలంవేస్తే మాబోటి బీదా బిక్కా ఏమి చేయగలం?'

'నాకు తెలియకుండా నా ఇల్లు వేలంవేయటమా! ఇంత ఘోరం ఎక్కడన్నావుందా?జమీందారు ఎలాంటివాడేమిటి?'

పొరుగావిడ జమీందారుసంగతి అంతా వివరంగా చెప్పి, 'ఇంత అత్యాచారీ, ఇంతగా ప్రజలను పీడించే జమీందారును ఈ ప్రాంతాల్లో నేనెప్పుడూ చూడలే'దని తేల్చింది.

'జమీందారుగారిని స్వయంగాచూస్తే లాభం ఉండదా?' మాధవి భయంతో అడిగింది. సంతోషకుమారునికోసం ఈపనికికూడా ఆమె వొప్పుకున్నది.

పొరుగావిడ అప్పుడేమీ చెప్పలేదు. కాని రేపు తన మేనల్లుణ్ణి కనుక్కునివచ్చి చెప్తానని వాగ్దానం చేసింది. ఆమె మేనల్లు డిదివరకు రెండుసార్లు లలితగ్రామం వెళ్ళాడు. జమీందారుగారిసంగతీ మేనేజరుసంగతీ అతనికి బాగా తెలుసును. వీరిదేకాదు, వాటికాగృహంలో వుండే ఏలోకేశి సంగతికూడా అతడు వినివచ్చాడు. 'మాధవి జమీందారును చూడటం వుచితమా, కాదా? అని మేనత్త అతన్ని అడిగినప్పుడు, ముఖాన్ని సాధ్యమైనంతవరకు గంభీరంగా పెట్టి, 'ఆమె వయస్సెంత?' అని ప్రశ్నించాడు.

'ఇరవై, ఇరవైయొకటి ఉంటుంది.'

'చూపులకు ఎలా ఉంటుంది.'

'దేవకన్యక!'

అప్పుడతడు ముఖభంగిమమార్చి-'చూస్తే పనికావచ్చు. కాని ఆమె ఈరాత్రే పడవ కుదుర్చుకుని తండ్రిగారింటికి వెళ్ళటం మంచిదని నా ఉద్దేశ్యం,' అన్నాడు.

'ఎందుకని?'

'నీవు చెప్పావుగా, ఆమె దేవకన్యకని.'

'అయితే ఏం?'

'అదే అసలుమూలం, చూపులకు అందంగా వున్నారంటే జమీందారు సురేన్‌రాయి చేతిలోనుంచి తప్పించుకోలేరు.'

మేనత్త పెదవిమీద వేలుపెట్టుకొని-'ఏమిటి! అంతేనా?' అన్నది.

'ఆ! అంతే ఈసంగతి దేశమంతటికీ తెలుసు!' అన్నాడు

5

మేనల్లుడు మందహాసం చేస్తూ.

'అయితే చూడటం మంచిది కాదా?'

'ఎంతమాత్రమూ మంచిది కాదు.'

'మరి ఆ స్తిపాస్తులన్నీ పోతున్నాయిగా?'

'చటర్జీగారు ఈ వ్యవహారంలో వున్నప్పుడు ఇంకా ఆ స్తి మీాద ఆశగా ఉన్నదా! కులీనులపిల్ల. ఆఖరికి శీలంకూడా పోగొట్టుకుంటుందా?'

మర్నాడు ఆమె మాధవికి ఈసంగతంతా చెప్పింది. విని మాధవి స్తంభించిపోయింది. ఆ వేళంతా జమీాందారు సురేన్ రాయ్ సంగతే ఆలోచిస్తూ ఉన్నది. 'సురేన్ రాయ్!' పేరు ఆమెకు చాలా పరిచితమైందే. కాని తాను ఎరిగిన వ్యక్తి స్వభావంతో ఇతని స్వభావమేమీా కలియటంలేదు. అయిదు సంవత్సరాలక్రిందట ఈపేరు ఆమె ఎన్నోసార్లు తలచింది. కాని ఇపుడు మరిచిపోయింది, మళ్ళా జ్ఞాపకం వచ్చింది.

స్వప్నాలతోనూ, యోచనలతోనూ ఆమెకు రాత్రంతా నిద్రపట్టలేదు. పూర్వపుసంగతులు అనేకం జ్ఞాపకంవచ్చినవి. చాలాసార్లు ఆమెకళ్ళవెంట నీరుకారింది. మర్నాడు సంతోష కుమారుడు, 'అత్తయ్యా, నేను అమ్మదగ్గరికి పోతా,' నని భయపడుతూ అడిగాడు.

మాధవికూడా అక్కడికే వెళ్ళాలని ఒకవిధంగా నిశ్చయించుకున్నది. ఇక్కడనుంచి కదిలితే ఆమెకు కాశీవెళ్ళటం తప్ప గత్యంతరంలేదు. సంతోషునికోసం జమీాందారును కూడా చూడ దలచుకొన్నది. కాని ఇరుగుపొరుగువారు

గట్టిగా వద్దన్నారు. ఇప్పుడు ఎక్కడకు పోవాలన్నా ఇంకో కొత్తఉత్పాతం వచ్చి కూర్చుంది, రూపయౌవనాలు!— 'పాడురాత! ఈ ఉత్పాతాలింకా నన్ను అంటిపెట్టుకునే ఉన్నాయా?' అని మాధవి లోలోపల అనుకొన్నది. ఇప్పటికి ఏడు సంవత్సరాలయింది, ఆమె వీటిని మరిచిపోయి. జ్ఞాపకం చేసేవారుకూడా ఎవ్వరూలేరు. భర్త చనిపోయినాక తండ్రి గారింటికి వెళ్ళినప్పుడు అందరూ ఆమెను 'బడదీదీ' అని పిలిచారు; అందరూ 'తల్లీ!' అన్నారు. ఈ ఆదరంతోకూడిన పిలుపులు ఆమెమనస్సును ఇంకా ముదుసలిని చేసివేసినై. బడదీదీ మాదిరిగా పనులు నెరవేర్చ వలసినప్పుడూ, తల్లి వలె ఆదర ప్రేమలు పంచవలసి నప్పుడూ, ఈ పాడు రూప యౌవనాలు తలపుకువచ్చేవా! అపుడు మనస్సులో లేవు— ఇపుడు జ్ఞాపకంవచ్చాయి. అందుకనే వాటిని గురించి ఆలోచిస్తున్నది. విశేషించి యౌవనం సంగతి! ఆమెను ఎక్కడా లేని ఏవగింపూ సిగ్గూ ఆవరించింది. 'ఇక్కడి ప్రజలు అంధులాలేక పశువులా?' అని ఆమె అనుకుంది. కాని మాధవి చాలా పొరపాటు పడింది. అందరి మనస్సూ ఆమెమాదిరి ఇరవై, ఇరవై రెండు ఏళ్లకు వృద్ధాప్యంలోకి రాదని ఆమెకు తెలియదు.

తర్వాత మూడురోజులకు జమీందారుగారి నౌకరువచ్చి ఆమె వాకిట్లో తిష్టవేసి సురేంద్రుడు కొత్తగా సంపాదించిన ఈకీర్తిని గ్రామస్థుల కందరికీ తెలియజేయ నారంభించాడు! మాధవి ఇల్లు వదలిపెట్టి, సంతోషుని చేయిపట్టుకొని, దాసీని

అనుసరించి పోయి పడవ ఎక్కింది.

ఇంటిదగ్గరగానే నది. సోమరాపురం పోనివ్వమని నావికునితో చెప్పింది—ఒకమాటు ప్రమీలను చూస్తుంది. గోవిందపురానికి సోమరాపురం పదిహేను క్రోసుల దూరం ఉంటుంది. ప్రమీలను అక్కడే యిచ్చారు. ఒక సంవత్సరమైంది, ఆమె కాపురానికి పోయి. మళ్లీ చూట్టం పడుతుందో పడదోనని మాధవి ఇప్పుడే చూచి పోదలచుకున్నది. ఆమె కలకత్తాలో ఉంటే ప్రమీల ఎప్పుడైనా కనపడుతుంది, కాని మాధవి ఇక కలకత్తా పోదలచలేదు.

సూర్యోదయంతోపాటు నావికులు నౌకను కూడా వదిలారు. నావ ప్రవాహానికి ఎదురుగా పోతూ ఉన్నది. గాలి కూడా అనుకూలంగా లేదు. అందుకనే, నావ వెదురుతోపుల మధ్యగుండా చువ్వలను తప్పించుకుంటూ నెమ్మదిగా పోతూ ఉన్నది. సంతోష కుమారుని ఆనందానికి మేర లేదు. వాడు నావమీద పడుతూఉన్న వెదురు బెత్తాలను విరవటంలో నిమగ్నుడై ఉన్నాడు. 'గాలి యిలాఉంటే రేపు మధ్యాహ్నానికిగాని నావ సోమరాపురంచేర' దని నావికులు చెప్పారు.

ఇవ్వాళ ఏకాదశి. మాధవికి ఉపవాస దినం. కాని సంతోషునికోసం పడవ ఎక్కడున్నా ఆపి వంట చేయవలసి ఉంది. 'షాడాగంజ్‌లో నావను కట్టివేస్తే వీలుగాఉంటుంది. అక్కడ సమస్తమూ దొరుకుతవి,' అని నావికుడు చెప్పాడు.

'అగాగే చేయి, బాబు! పది ఘంటల లోపల కుర్రవాడెలాగన్నా ఎంగిలి పడేటట్టు చూడు.' అన్నది దాసి.

౯

కార్తీకమాసం వెళ్ళిపోవచ్చింది. కొంచెం చలికూడా ప్రారంభ మయింది. సురేంద్రుడు పైఅంతస్తు గదిలో కిటికీ దగ్గరగా టేబిలు ముందు కూర్చుని ఉన్నాడు. కిటికీలోంచి బాలసూర్యుని లేత కిరణాలు టేబిలుమీద పడుతూ ఉన్నై. ఆదృశ్యం చాలా మనోహరంగా ఉంది. సురేంద్రుడు అర్జీలూ, ఖాతా పుస్తకాలూ, జడ్జిమెంట్లూ ఒక్కొక్కటిగా తిరగ వేస్తూ ఉన్నాడు. ఇవన్నీ చూడటం అతనికి అలవాటై పోయింది. ఈపని లేకపోతే అతనికి కాలంకూడా గడవటం లేదు. శాంతితో ఈవిషయమై చాలా పోట్లాటకూడా జరిగింది. చాలా వాదించినమీదట—అక్షరాలవంక చూచినంత మాత్రాన గుండెనొప్పి యెక్కువ కాదనీ, అథవా బలవంతాన అక్కడనుంచి కదలించినా విశేష ప్రయోజనమేమీ ఉండ దనీ, ఆమెకు నచ్చ చెప్పాడు, అందుచేత శాంతి ఒప్పుకొని అవసరమైన సహాయంకూడా చేస్తూ ఉన్నది.

ఇపు డామెకు భర్తమీద పూర్తిఅధికారం కలిగింది. ఆమె ప్రతిమాటా చలామణి అవుతూఉన్నది. నిజానికి, ఆమె మాట ఎప్పుడుకూడా తోసివేయబడలేదు. ఈదౌర్భాగ్యులైన మిత్రుల మూలానే శాంతి కొన్నాళ్ళు దుఃఖం అనుభవించింది. ఇపుడామె చెప్పినప్రకారం సురేంద్రుడు క్రిందకు దిగటంకూడా మానివేశాడు. శాంతి ప్రాణపదంగా డాక్టరు గారిసలహా పాలిస్తూ వస్తున్నది.

ఇప్పుడే ఆమెరంగు దారంతో కొన్ని తాయితాలు కట్ట

కట్టి కిందకు దిగిపోయింది. సురేంద్రుడు ఒక కాగితం మీద నుంచి దృష్టిమరల్చి 'శాంతీ!' అని హఠాత్తుగా పిలిచాడు.

శాంతి ఏదో పనిమీద పోయింది. కాసేపట్లో తిరిగివచ్చి 'పిల్చారా?' అని అడిగింది.

'ఆఁ' ఒకమాటు కచేరికి వెళ్లి వస్తాను.'

'వద్దు. ఏంకావాలో చెప్పండి, నేనే తెప్పించి యిస్తాను.'

'ఏమీలేదు. ఒకమాటు మధురబాబును చూడాలి.'

'వారిని పిలిపిస్తాను. మీరు వెళ్లవద్దు! అయితే వారితో యిప్పుడంత అవసర మేమొచ్చింది?'

'కార్తీకమాసం గడిచినాక పనిలోకి రావద్దని చెప్పి వస్తాను.' శాంతికి విస్మయం కలిగింది. కాని సంతుష్టురాలై—'అతని అపరాధం?' అని అడిగింది.

'అపరాధ మేమిటో నేను సరిగా చెప్పలేను—కాని చాలా పెచ్చుమీరి పనులు చేస్తున్నాడు.' తర్వాత కోర్టు సర్టిఫికెట్లూ ఇంకా కొన్ని యితర కాయితాలూ చూపిస్తూ అన్నాడు—'గోవిందపురంలో ఒక విధవ ఆస్తిపాస్తులన్నీ చాటుగా వేలం వేయించి కొనేశాడు. నాకు మాటమాత్ర మయినా చెప్పలేదు.'

'పాపం విధవదా! చేసింది మంచి పనికాదు—కాని వేలం వేసింది ఎందుకు?'—శాంతి విచారంతో అడిగింది.

'పది సంవత్సరాల నుంచీ శిస్తు బకాయి ఉంది. వడ్డీ అసలూ కలిపి దానికే పది హేను వందలకు దావాచేశాడు.'

డబ్బు సంగతి వినగానే శాంతికి మధురబాబుమీద సామ

భూతి కలిగింది. 'ఇందులో మేనేజరు తప్పేమున్నది? అంత డబ్బు యెలా వదలి పెడతారు?'—శాంతి మందహాసం చేస్తూ అడిగింది.

సురేంద్రు డన్యమనస్కంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

'అంతడబ్బు వదలిపెడతారా?' శాంతి మళ్లీ అడిగింది.

'వదలక! ఒక నిరాధారమైన విధవను యింట్లోనుంచి వెళ్లగొడతావా?—నీసలహా ఏమిటి?'

ఆమాటలలోవున్న జ్వాల శాంతికి అంటుకొన్నది. అప్రతిభురాలై, 'నేను ఇంట్లోనుంచి వెళ్లగొట్టమని చెప్పటంలేదు. అసలు మీడబ్బు మీరు ధర్మం చేస్తుంటే నేనెందుకు అడ్డు పడతాను?' అని ఖేదంతో అన్నది.

సురేంద్రుడు నవ్వుతూ అన్నాడు: 'అదికాదు, శాంతీ! నాడబ్బు నీదికాదా? నీవే చెప్పూ, నేను లేనప్పుడు నీవు—'

'అబ్బ! అవేమి మాటలండీ?—'

'నీవు నాకిష్టమైన పనులు చేయవా?'

శాంతి కళ్ళలో నీరు తిరిగింది. భర్త ఆరోగ్యం కూడా సరిగాలేదు. 'అలాంటి మాటలెందుకు చెప్తారండీ?' అంది.

'నాకు చాలా బాగుంటుంది, అందుకనే చెప్తాను. నీవు నా కోరిక తెలుసుకొని ఉండవా, శాంతీ?'

శాంతి ముఖం చెరుగుతో కప్పుకొని తల ఊపింది.

కాసేపు ఉరుకుని—'నా బడదీదీ పేరు!' అన్నాడు సురేంద్రుడు. శాంతి ముఖంమీదనుంచి చెరగుతీసి సురేంద్రుని వంక చూసింది.

'ఇదిగో చూడు, నా బడదీదీ పేరు.' అన్నాడు సురేంద్రుడు ఒక కాగితం చూపిస్తూ.

'ఎక్కడ?'

'ఇదిగో 'మాధవీ దేవి'—ఈమె ఇల్లే వేలం వేశారు.'

ఒక్క క్షణంలో శాంతి అనేక విషయాలు గ్రహించింది—'అందుచేత నేనా ఆస్తంతా తిరిగి ఇవ్వాలంటున్నారు?' అని అడిగింది.

'అందుచేతనే తిరిగి ఇస్తాను, సర్వమూ—సమస్తమూ!' అని సురేంద్రుడు మందహాసంచేస్తూ జవాబిచ్చాను.

మాధవి పేరు విని శాంతి దుఃఖితురాలైంది. లోపల కొంత అసూయకూడా కలిగింది. 'ఆమె మీ బడదీదీ కాదుగా! 'మాధవీ దేవి' అని మాత్రం ఉన్నది. పేరుకే—'

'బడదీదీ పేరును ఆ మాత్రమైనా గౌరవించనా?'

'గౌరవించండి, కాని ఆమెకీసంగతి ఏమి తెలుస్తుంది?'

'తెలుసునో లేదని నేను అగౌరవం చేయగలనా?'

'ఈ పేరు చాలామందికి ఉన్నది.'

'నీవు దుర్గ పేరురాసి దానిమీద కాలు పెట్టగలవా?'

'ఆవేమి మాటలండి! దేవతల్ని అలా—'

సురేంద్రుడు నవ్వుతూ అన్నాడు—'సరే. నేనిక దేవతల పేర్లు ఎత్తను! కాని ఒకపని చేయగలవా, నీకు అయిదు వేల రూపాయ లిస్తాను?'

'ఏం పని?' శాంతి ఉత్సాహంతో అడిగింది.

గోడను సురేంద్రుని ఫొటో వున్నది! దానివంక చూపిస్తూ

అన్నాడు—'ఆబ్రాహ్మను—'

'ఏం చేయాలి?'

'నలుగురు బ్రాహ్మణులచేత మోయించుకొని స్మశానం లోకి తీసుకెళ్ళి తగల బెట్టించాలి.'

దగ్గరలో పిడుగు పడితే మొదట రక్తమంతా ఒక్కనిము షంలో ఎలా పీల్చుకు పోతుందో, సర్పదష్ట రోగివలె ముఖం నీలవర్ణానికి ఎలా తిరుగుతుందో—అలానే శాంతికూడా మొదట అయింది. నెమ్మదిగా మళ్ళీ ముఖంలోనికీ కళ్లల్లోకీ రక్తం వచ్చింది—పిమ్మట కరుణా దృక్కులతో భర్తవంక చూస్తూ క్రిందకు నిశ్శబ్దంగా దిగిపోయింది. పురోహితుని పిలిపించి శాస్త్రరీత్యా శాంతి జరిగించమని చెప్పి, తనమీాద ఒట్టుపెట్టుకొని—'బడదీదీ ఎవరైనా కానీయండి, ఆమె విషయంలో ఇక నేనేమీా మాట్లాడను!' అని ప్రతిజ్ఞ చేసింది. తర్వాత తలుపుబిగించి చాలా సేపటివరకూ కన్నీరు కారుస్తూ కూర్చుంది. ఇంత కటువాక్యాలు ఆమె జీవితంలో ఎప్పుడూ వినలేదు.

సురేంద్రుడు కూడా కాసేపు నిశ్శబ్దంగానే కూర్చుని తర్వాత లేచి బయటికి వెళ్లిపోయాడు, కచేరిలో మధుర బాబు కనబడగానే— 'గోవిందపురంలో వేలం వేసింది ఎవరాస్తి?' అని అడిగాడు.

'రామతను సన్యాలు విధవ కోడలిది—'

'ఎందుకు?'

'పది సంవత్సరాలనుంచీ శిస్తు బకాయిపడింది.'

'ఏదీ ఖాతా చూపించు, చూస్తాను—'

మధుర బాబు మొదట హత బుద్ధుడయాడు. తర్వాత కాస్తై తెప్పరిల్లుకుని 'ఇంకా చిట్టాలు పాబనా నుంచి తీసుక రాలేదు,' అన్నాడు.

'తీసుకు రావటానికి మనిషిని పంపు. ఆవిధవకు తల దాచు కోవటానికైనా చోటున్నదా?'

'లేదనుకుంటాను.'

'అయితే ఇప్పుడు ఎక్కడ ఉంటుంది?'

'ఇన్నాళ్ళ నుంచీ ఉంటున్న చోటనే ఉంటుం దనుకుంటా,' నన్నాడు, మధురబాబు ధైర్యం తెచ్చుకుని.

'ఇన్నాళ్ళనుంచీ ఎక్కడ ఉంది?'

'కలకత్తాలో—తండ్రిగారింట.'

'తండ్రిగారి పేరేమిటో తెలుసునా?'

'ఆ. వ్రజరాజ లాహిడీ.'

'విధవ పేరు?'

'మాధవీ దేవి.'

సురేంద్రుడు తల వంచుకుని అక్కడే కూలబడ్డాడు. మధురబాబుకు యేమీ అర్థంకాలేదు, 'ఏమయిందేమిటి?' అని అడిగాడు.

సురేంద్రుడు జవాబివ్వకుండా నౌకరును పిలిచి ఆజ్ఞాపించాడు—'మంచి గుర్రాని కొకదానికి జీను వేయమని చెప్పు—నేనిప్పుడే గోవిందపురం వెళ్లాలి. ఇక్కడకు గోవింద పురం యెంత దూరం ఉంటుందో తెలుసునా?'

'దాదాపు పదికోసు లుంటుంది.'

'ఇప్పుడు తొమ్మిది ఘంట లయింది, ఒంటి ఘంట లోపుగా వెళ్ళగలనా?'

'వెళ్ళవచ్చు.'

గుర్రం వచ్చినాక దానిపైన ఎక్కి 'ఎటువైపు?' అని అడిగాడు సురేంద్రుడు.

'ఉత్తరపు వైపు, కొంత దూరంపోయినాక పడమటికి తిరగాల్సి ఉంటుంది.'

గుర్రం కొరడా దెబ్బతిని పరుగుపెట్టింది.

ఈమాటవిని శాంతి దేవతా గృహంలో తల నెత్తురు కారేటట్టు నేలకువేసి కొట్టుకొని—'దేవీ! ఇదేనా నీకోరిక! నా నాథుడు తిరిగి దక్కుతాడా?' అని రోదించింది.

తర్వాత ఇద్దరు గుర్రపు రౌతులు గోవిందపురం వెళ్ళిపోయారు. శాంతి కిటికీలోంచి కళ్ళు తుడుచుకొంటూ వారిని చూసింది—'కాళీమాతా! నీకు జోడు వేటలు బలిస్తాను—నీకు యేది కావలసినా ఇస్తాను. నా నాథుని తిరిగి ఇవ్వు. హృదయం చీల్చి రక్తం ఇస్తాను—ఎంత కావలసినా! ఓ దుర్గా! నీదాహం తీరేటంత రక్తం యిస్తాను!' అని కాళినుద్దేశించి ప్రార్థించింది.

గోవిందపురం ఇంకా రెండు క్రోసులదూరం ఉంటుంది. గుర్రం దుమ్ము రేపుతూ నురుగు కక్కుతూ శక్తికొద్ది పరుగెత్తుతూ ఉంది. మిటమిటలాడే ఎండ—తల మాడిపోతూ ఉన్నది. గుర్రంమీద ఉన్నా, సురేంద్రుని శరీరం ఉడికి

పోతూ ఉన్నది. లోపలఉన్న ప్రతి నాడీ బ్రద్దలవుతున్నట్టుగా తోచింది. వాంతి వచ్చేటట్టుగా కూడా ఉంది. భోక్కు మన్నాడు—రెండు గుక్కల నెత్తురు దుమ్ము కొట్టుకొని ఉన్న అతని చొక్కామీద పడింది. సురేంద్రుడు చేతితో మూతి తుడుచుకొన్నాడు.

ఒంటిఘంటకు ముందే గోవిందపురంచేరి ఊరిబయటఉన్న సెట్టిని 'గోవిందపురం ఇదేనా ?' అని అడిగాడు.

'ఆఁ'

'రామతను సన్యాల్ ఇల్లెక్కడ ?'

'ఆవైపు—' మళ్ళీ గుర్రం పరుగెత్తింది. కాసేపట్లోనే తనకు కావలసిన ఇంటిముందుకువచ్చి నిలబడ్డాడు. వాకిట్లో వీరి బంట్రోతే ఉన్నాడు. యజమానిని చూడగానే నమస్కరించాడు.

'ఇంట్లో ఎవరున్నారు ?'

'ఎవ్వరూ లేరండి.'

'ఎవ్వరూ లేరా—ఎక్కడికి వెళ్లారు ?'

'ఉదయాన్నే పడవ చేసుకుని వెళ్ళిపోయారండి.'

'ఎక్కడకు—ఎటు ?'

'దక్షిణపువైపుకు—'

'నది ఒడ్డున దోవ ఉందా, గుర్రం పోవటానికి ?

'నాకు తెలియదండీ—లేదనుకుంటాను.'

మళ్ళీ గుర్రం పరుగెత్తింది. రెండు కోసులు పోయినాక దోవ సరిగా లేదు. సురేంద్రుడు గుర్రాన్ని వదలిపెట్టి కాలి

నడకను బయలుదేరాడు. ఒకమాటు గుడ్డలవంక చూచుకున్నాడు. చొక్కానిండా నెత్తురు. దుమ్ముతో కలిసి ఎండుకుపోయి ఉన్నది. పెదవులవెంట ఇంకా నెత్తురు కారుతూనే ఉన్నది. నదిలోదిగి నోరు కడుక్కొని దోసెడు నీళ్లుత్రాగి మళ్లీ పరుగు తీశాడు. కాళ్ళను చెప్పులులేవు. శరీరమంతా ధూళీ—నెత్తురు మచ్చలూ! అతని ఎదురు రొమ్మునిండా నెత్తురు ఎవరో చల్లినట్టుగా ఉన్నది.

పొద్దు బాగా ఏటవాలింది. కాళ్ళు ముందుకు సాగటం లేదు—ఒక్కమాటు గనక మేను వాల్చగలిగితే ఈ జీవితాని కంతకూ సుఖనిద్ర పోవచ్చు. ఈ ఆశతోటే—అంతిమ శయ్యమీాద ఈ జీవితాని కంతకూ చిరవిశ్రాంతి దొరుకుతుందనే నమ్మకంతోటే...అతడు ఉన్మత్తునివలె పరుగెత్తుతూ ఉన్నాడు. ఈదేహంలోవున్న శక్తినంతా బాధను లెక్కచెయ్యకుండా — ఖర్చుపెట్టి మరణశయ్యను ఆశ్రయిస్తాడు. ఇక లేవడు!

నదిమలుపు—ఆ కనపడేది నావకాదా? కూలీలు నది కట్టలు బాగుచేస్తున్నారు—'బడదీదీ' అని సురేంద్రుడు కేక వేశాడు. ఎండిపోయిన గొంతు నుంచి మాట బయటకు రాలేదు. రెండు మూడు నెత్తురు చుక్కలు మాత్రం పడ్డవి.

'బడదీదీ'—మళ్లీ రెండు మూడు చుక్కల నెత్తురు.

కూలీలు పడవను ఆపించారు. సురేంద్రుడు దగ్గరకు వచ్చి మళ్ళీ పిల్చాడు—'బడదీదీ!'

ఆపగలంతా పస్తుండటంచేతనూ మనోవ్యథ మూలానా,

మాధవి నిర్జీవి వలె నిద్రపోతూఉన్న సంతోష కుమారుని పక్కన పండుకొని ఉన్నది. హఠాత్తుగా ఈ పిలుపు ఆమె చెవిని పడింది.

పూర్వపరిచిత స్వరంతో ఎవరు ఆమెను పిల్చేది? మాధవి లేచి కూర్చుని ముఖం బయటికి పెట్టి చూసింది. శరీర మంతా ఏమిటా దుమ్ము? మాస్టరుగారు కారూ?—'ఓఅమ్మా! శీఘ్రంగా నావను ఒడ్డుకు పోనిమ్మని సరంగుతో చెప్పు.'

సురేంద్రుడు నెమ్మదిగా నదిఒడ్డున మేను వాల్చాడు. అందరూకలిసి సురేంద్రుని నావలోకి చేర్చారు, ముఖం కళ్లూ తడిగుడ్డతో తుడిచారు. నావికులలో ఒకడు వీరిని ఎరుగు. వీరే లలితపురం జమీందారు గారని వాడు చెప్పాడు.

'లలితపురం ఈరాత్రికి చేర్చగలరా? మీఅందరికీ తలా ఒకహారం ఇస్తాను,' అని మాధవి రత్నఖచితమైన స్వర్ణ హారం మెడలోనుంచి తీసి వాడిచేతిలో పెట్టింది. స్వర్ణహారం చూసి నావలోనుంచి ముగ్గురు మనుష్యులు తాడు భుజాన పెట్టుకొని దిగారు. 'వెన్నెల రాత్రిళ్లు, తెల్లవారే లోపల చేర్చగలం, తల్లీ!' అన్నాడు ఒక నావికుడు.

సాయంకాలం సురేంద్రునికి స్మృతి వచ్చింది. కళ్లు తెరచి మాధవి ముఖం వంక చూస్తూ ఉన్నాడు; మాధవి ముఖం మీద అప్పుడు అవగుంఠనం లేదు. శిరస్సు చెరగుతో కప్పి ఉన్నది. సురేంద్రుని తల తొడమీద పెట్టుకొని ఆమె నిశ్చ లంగా కూర్చుని ఉంది. కొంచెంసేపు అలానే చూచి సురేం ద్రుడు అడిగాడు. నీవు 'బడదీదీవా?'

మాధవి చీర చెరగుతో అతని పెదవి మీద ఉన్న రక్తబిందువులు జాగ్రత్తగా తుడిచింది. తర్వాత తనకళ్ళు తుడుచుకొంది.

'నీవు బడదీదీవా ?'

'నేను మాధవిని.'

సురేంద్రుడు కళ్ళు మూసుకొని మృదుస్వరంతో 'ఆ, అదే—' అన్నాడు—

విశ్వంలోని విశ్రాంతిఅంతా ఈ ఒడిలోనే దాగి ఉన్నట్టుంది. ఇన్నాళ్ళ తర్వాత సురేంద్రుడు దానిని వెదకి, అనుభవించ కలిగాడు. పెదవులమీద రక్తంతో కూడిన చిరునవ్వు కూడా కనిపించింది. 'బడదీదీ, ఎంతబాధ!' అని నిట్టూర్చాడు.

గలగల నీళ్ళను కోసుకుంటూ నావ పోతూఉన్నది. పడవ కప్పులోంచి సురేంద్రుని ముఖం మీద చంద్ర కిరణాలు పడుతూ ఉన్నవి; దాసి చిరిగిపోయిన విసనకర్ర తీసుకొని నెమ్మదిగా విసరుతూ వున్నది. సురేంద్రుడు నెమ్మదిగా— 'ఎక్కడికి పోతున్నావు?' అని అడిగాడు.

'ప్రమీల అత్తగారింటికి!' అందిమాధవి భగ్నకంఠంతో.

'ఛీ! ఇలాంటిస్థితిలో చుట్టాలింటికి పోవచ్చునా, బడదీదీ?'

## ౧౦

స్వగృహమున తన పడకగదిలో బడదీదీ ఒడిలో తల పెట్టి సురేంద్రుడు మృత్యుశయ్యమీద పడుకుని వున్నాడు. కాళ్ళు రెండూ శాంతి తన వొడిలో పెట్టుకొని కన్నీటితో కడిగ

వేస్తూ వున్నది, పాబనాలో వున్న డాక్టర్లూ వైద్యులూ అందరూ ఏకంగా ప్రయత్నించి, పరిశ్రమచేసికూడా రక్తాన్ని ఆపలేకపోయారు. అయిదు సంవత్సరాల క్రితం తగిలిన ఆ దెబ్బమూలానే ఇప్పుడు రక్తం కక్కుతున్నాడు.

మాధవి అంతరంగంలో ఏమున్నదో నేను చెప్పలేను. నాకు సరిగా తెలియదు కూడా. కాని, అయిదు సంవత్సరాల క్రితం జరిగిన సంగతులు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నదని మాత్రం ఊహిస్తున్నాను: ఇంటోనుంచి అప్పుడామె అతన్ని వెళ్ళగొట్టిందికాని తిరిగి తీసుకురాలేక పోయింది. ఇప్పుడు, అయిదు సంవత్సరాలు గడిచినాక సురేంద్రుడామెను తిరిగి తీసుకువచ్చాడు.

పొద్దుకుంకింది. గదిలో దీపం జ్యోతివలె వెలుగుతున్నది. సురేంద్రుడు ఒకమాటు మాధవి ముఖం వంక చూశాడు. కాళ్ళదగ్గర శాంతి కూర్చుని వున్నది. ఆమెకు వినబడుతుందేమోనని మాధవి ముఖమును చేతితో దగ్గరకు లాగి మెల్లగా అన్నాడు—'బడదీదీ! నీకారోజు జ్ఞాపకమున్నదా—నన్ను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టితివే? దానికే నిన్నిప్పుడు వెళ్ళగొట్టి పగ తీర్చుకున్నాను ఏమంటావ్—బదులు భర్తీ అయిందా ?'

ఒక్క క్షణంలో మాధవి స్మృతి తప్పి సురేంద్రుని పక్కనే పడిపోయింది. తెలివివచ్చేవరకు ఇల్లంతా రోదన ధ్వనితో నిండి వున్నది.

## పాఠకులకు విన్నపము

మా ప్రచురణలు ముఖ్యమయిన పుస్తక విక్రేతలు, న్యూసు ఏజంట్లు అందరివద్దా దొరకును. ఒకవేళ దొరకనిచో మాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. 6-0-0 విలువగల పుస్తకములు ఒకేమాటు తెప్పించుకొనువారికి పోస్టుఖర్చులు మేమేభరిస్తాము.

| | | | |
|---|---|---|---|
| 1. పాపం!!! | (కథలు) | 'చలం' | 0-12-0 |
| 2. హంపీ కన్యలు | (నవల) | .. | 0-12-0 |
| 3. అరుణ | .. | .. | 0-12-0 |
| 4. బ్రాహ్మణీకం | .. | .. | 0-12-0 |
| 5. అనావీలరు | .. | సౌరిస్ | 0-12-0 |
| 6. మారుపేర్లు | .. | కుటుంబరావు | 0-12-0 |
| 7. కులంలేని మనిషి | .. | .. | 0-12-0 |
| 8. బడదీదీ | .. | శరత్‌బాబు | 0-12-0 |
| 9. పతివ్రత | .. | .. | 0-12-0 |
| 10. పల్లీయులు | .. | .. | 1-8-0 |
| 11. దేవదాసు | .. | .. | 1-8-0 |
| 12. పరిణీత | .. | .. | 0-12-0 |
| 13. తోకచుక్క | (కథలు) | 'చక్రపాణి' | 0-12-0 |
| 14. పాతమంగలి | .. | .. | 0-12-0 |
| 15. ఎనపూల్ రచనలు | .. | .. | 0-12-0 |
| 16. పరశురాం కథలు | .. | .. | 0-12-0 |
| 17. బెంగాలీ కథలు | .. | .. | 2-0-0 |
| 18. మైత్రా కథలు | .. | .. | 2-0-0 |
| 19. మూగజీవాలు | .. | గోఖలే | 0-12 0 |
| 20. కదంబం | .. | నార్ల | 0-12-0 |
| 21. రూం టు లెట్ | .. | బాలక్రిష్ణశాస్త్రి | 0-12-0 |
| 22. మంగమ్మ | (నాటకం) | 'చలం' | 1-0-0 |
| 23. పలితకేశము | (కావ్యం) | దువ్వూరి | 1-0-0 |
| 24. కడలి పొంగులు | .. | సముద్రులు | 1-0-0 |